# సుత్తూరు గురుపరంపర

రచయిత బాడాల రామయ్య





జగద్గురు శ్రీ శివరాత్రీశ్వర గ్రంథమాల

మైసూరు 570 004

# సుత్తూరు గురుపరంపర

**బాడాల రామయ్య**

గ్రంథకర్త

జగద్గురు శ్రీ శివరాత్రీశ్వర గ్రంథమాల
మైసూరు

సూత్తూరు గురు పరంపర

"Sutturu Guruparampara" is poetic work on Suttur Math, written by Prof. Badala Ramaiah Published by Jagadguru Sri Shicarathreeswara Garanthamale, Mysore - 570 004



First Edition : 1996, 190+20p.p.





వెల :70-00 రూ.

ముద్రణ :

ఆత్రేయ ప్రోసెస్ ప్రై. లిమిటెడ్, బెంగళూరు. దూ. : 3351684, 3352961

జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ్
డా. సి. నారాయణ రెడ్డి, ఎం.ఏ., పి.హెచ్.డి., డి.లిట్.
రాష్ట్రప్రభుత్వ సాంస్కృతిక, భాషావ్యవహారాల సలహాదారు

కార్యాలయం : 242082
గృహం : 248451
కళాభవన్, హైదరాబాద్ - 500 004,
ఆంధ్రప్రదేశ్

# అభిప్రాయం

కవిగా "లేపాక్షి" కావ్యం ద్వారా, విమర్శకుడిగా "బసవేశ్వర వచనా" నువాద గ్రంథం ద్వారా తెలుగు సాహిత్య లోకంలో అగ్రేసర రచయితగా ప్రసిద్ధులైన డా. బాడాల రామయ్య గారు "శ్రీసుత్తూరు గురుపరంపర"అనే సుదీర్ఘ కావ్య రచన చేయడం సంతోషం. రాగ వైరాగ్య ధర్మకర్మాభిరతులైన సుత్తూరు మఠాధిపతుల చరితం రాజేంద్రగురుని గాధ మధ్యమ మణిగా కధన రమ్యంగా రూపొందించిన ఈ గ్రంథం రామయ్యగారి రచనా ప్రతిభకు మణి దర్పణం.అనవద్య పద్యరచనలో చేయితిరిగిన రామయ్యగారి రచనా రీతి శరత్కాల జీవనదిలా సాగిపోయింది.

రాజేంద్రగురూక్తులకు ముక్తాహార సదృశంగా ఆకృతి దాల్చిన పద్యమిది.

నమ్మిన శిలయేని, నారాయణుండగు
ప్రణయమున్న మిత్తిభాగ్యమొసగు,
శాంతికలుగ ముక్తి సామ్రాజ్యమే దక్కు
చూని నరుడు వీని పొందవలయు ॥ (పద్యం. 78, పుట. 171)

ఇలాంటి ఆణిముత్యాలెన్నెన్నో ఈ కృతినిండా వున్నాయి.

శివతత్వబంధురంగా, సమధర్మ నిర్భరంగా గురు పరంపర గాధలను సహృదయ రమ్యంగా గ్రథనం చేసిన మిత్రులు డా. బాడాల రామయ్య గారికి నాఅభినందనలు.

# తపోవనం

"భోగ్యం హో తపోవనమిదం అయంచ మేసుదినం---"

-(ఉత్తరరామ చరిత్ర)

"మన్నే మూలము కడవలు సేయగ
పొన్నే మూలము తొడవులు సేయగ
గురు పధమే మూలము శివ పథము తెలియగ
శరణుల సంఘమే మూలము సంగని తెలియగ"

అని - బసవేశ్వర వచనాలను ఆయన దేశకాల చరిత్రాది పరిశోధనలతో పాటు తెలుగువారికి సశాస్త్రీయంగా పరిచయం చేసిన కవిమిత్రుడు బాడాల రామయ్య గారు మరలా ఈనాటికి శైవగురుపరంపరా స్తోత్రరూపకావ్యాన్ని తెలుగు శారదకు అంకితం చేస్తున్నారు.

ఏనాడో లేపాక్షి కావ్యం వ్రాసి కవిసామ్రాట్టుల మన్ననలకు పాత్రుడైన ఈ కవి వృద్ధుడే మరలా ఈనాడు సమృద్ధమైన కావ్యం వ్రాసి కవి కుమారుడైనాడు. కవి చిరంజీవి, కుమారత్వం, వృద్ధత్వం కావ్యక్రియా సంబంధాలు తప్ప కాయబద్ధాలు కావు. వృద్ధత్వం శివాత్మకం, కుమారత్వం శివాత్మజాత్మకం. రామయ్య గారి ఆత్మలో వారున్నారు. రాముని ఆత్మ శివుడైనట్లు. శివుని శరీరం రాముడైనట్లు. ఇదొక హరిహర బ్రహ్మమయమైన తేజస్సు. లేకపోతే రామకథా తత్వాన్ని గానం చేసిన ఈ కవి!

ఇప్పుడే శైవగురుపరంపరా స్తోత్రం చేయటంలో రహస్యమేమిటి ? ఆయనలో అద్వైతి ఒకడున్నాడు. వాడికే ఈ సమన్వయ దర్శనముంటుంది. లేనిచోట -?

ఈ సమన్వయాత్మక - సమతా దర్శనకారణ శక్తి ఏమిటి ? - అంటే చిత్ శక్తి సమారాధన భావన చింతన ఆ మహాజ్ఞానకాంతిలో పయనిస్తే తప్ప తత్కాంతి పరివేష్టితుడైతే తప్ప - ఈ అభేద భక్తిభావన కుదరదు.

ఆయనలో కరడు కట్టినది త్రికోణ విద్యాస్వరూపిణి యైన సౌందర్య లహరీ భావన. ఆది శంకరుల ఆ మహాకావ్య తంత్రాన్ని గీతాల్లోనే అనువదించారు. అచ్చయిందో, లేదోమరి నాకు తెలియదు. కాని వ్రాతప్రతి నుంచి ఆయన చదువగా విన్నాను. అది విన్నప్పుడు చాలా ఆశ్చర్యపోయాను. శంకరుల శిఖరిణీ గాంభీర్యాన్ని, వస్తుకాఠిన్యాన్ని మృదువైన గీతంలో సరళార్ధశబ్దంలో బంధించటమెలా సాధ్యమని !!

"మయదృష్టిః సకరుణా -" అన్నారు మహాచార్యులు అంతకు తప్ప మరొక కారణం తోచదు.

ఈ కవి కృష్ణకథా విపంచి వ్రాసి శ్రీకృష్ణదేవరాయలవారి ఋణం తీర్చుకోవటం సరే; నా కత్యంత భావ సన్నిహితుడైనాడు. పై రెండు (సౌందర్యలహరి - కృష్ణకథావిపంచి) కారణాలుగా నా ఆత్మస్నేహితుడైనాడు. రామయ్య కవి.

ఇదంతా గతవైభవ స్మరణ. అసలు కావ్యమేమి చేస్తున్నది? దాని తత్త్వమేమిటి? లేదా అసలు తత్త్వమేమిటి? - స్మృతిని త్రవ్వుకోవటం తప్ప. సర్వవిశ్వాన్ని నాలో కలుపుకొని విస్తరించిన నేను నా మూల భావ స్మరణ తప్ప. అద్దంలో నన్ను నేను చూచు కొంటున్నప్పుడు నాభావనేమిటి? నేనింత అందంగా ఉన్నానా? -అనే కదా! అలాగే శక్తి దర్పణంలో శివుడూ తనను తాను చూచుకొని తన యథార్థ శక్తికి తానే ఆశ్చర్య పోతున్నాడు. కావ్య దర్పణంలో సహృదయుడూ అంతే. తన అగాధాల్లోకి తాను ఆది కూర్మమై త్రవ్వుకొని పోతున్నాడు కవి.

కథ - వట్టికాగితం, శబ్దం - రంగు, రేఖ, ఇవన్నీ విశ్వాత్మభావనకు, సంవేదనకు మూల కారణసామగ్రి. మూలబిందువులో నేనున్నానంటూ సురిగిపోవటానికి పన్నినవల కళ. ఇందుకని బాడాల ఏకథ వ్రాసినా తన భావజగత్తులోకి తాను ప్రస్థానం చేస్తాడు. శ్రోతను తనతోపాటుగా తీసుకొనిపోతాడు.

ఒక కథ విన్నాను. చైనా చక్రవర్తి ఒకడు ఆస్థాన చిత్రకారుడిని నియమించుకోవటానికై, ఎందరినో ఆహ్వానించి, వలసిన సదుపాయాలు కల్పించి బొమ్మలు గీయమన్నాడట. ఎవడో ఒకవృద్ధశిల్పి మూడేళ్ళు కష్టపడిగీసి తెచ్చిన బొమ్మచూచి రాజు మూర్ఛపోయినంత పనికాగా, తేరుకొని ' ఓయీ ! కళా తపస్వీ ! ఇదేమి కళయ్యా ! ఇంత అద్భుతంగా ఉంటుందా ? చిత్రలేఖన విద్య, మహా శిల్పీ ! నీకు జోహారు ' అంటూ ఇలా ప్రశ్నిస్తాడు. ' ఇది సరే బొమ్మలో దూరాన కొండ- అడవిగుండా బాట- పోయిపోయి ఆబాట కొండపై మలుపులు తిరుగుతూ కొండకటు ప్రక్క లోయలోకి పోయింది కదా ! ఎక్కడ పోతున్నదది ?అన్నాడట శిల్పి. 'ప్రభూ ! ప్రయాణం చేయకుండానే పథ ధ్యేయమెలా చెప్పేద'న్నాడట. "అయితే సరే నేను వస్తానునీతో. పోదాం పద " అన్నాడట రాజు. "సరే, రా" అంటూ కళాయోగి ఆయనను చేత్తో పట్టుకొని ఆ బాట వెంట వెళ్ళాడట! వారిప్పటికీ తిరిగి రాలేదట ".

చైనా-జపాన్ బౌద్ధ కళా రహస్యం తెలిస్తే తప్ప ఈ కథా రహస్యం తెలియదు. ఆ కళా రహస్యమేమంటే ఆధ్యాత్మిక దర్శనం నుండి పుట్టిన కళ అది. రెండూ వేర్వేరు కాదు. అందుకే జపాన్ హైకూ పద్యాలు చిత్రకళా - అంత సరళంగా, ఋజువుగా-సహజంగా ఉంటాయి.

ఇదిగో ఈ మార్గమే బాడాల రామయ్యగారి గీత పద్యానికిన్నీ.

ప్రస్తుతకావ్యం రెండు పరిచ్ఛేదాలుగా విభక్తమైనది.అవి సార్థకమైన తపోవనం, అమృతఫలాలనే పేరుతో ప్రతిదీ నవాధ్యాయ సంపన్నంగా అలంకృతమైనది. ప్రతి అధ్యాయానికీ ఒక పేరు. -అది అధ్యాయ వస్తువ్యంజకంగా - సంస్కృత నాటక అంక నామ కరణం లాగా తీర్చబడటం. ప్రతి అధ్యాయారంభం ఒక పద్యంతో కావటం- ఆ పద్యం ఆ అధ్యాయ వస్తువును ధ్వనించటం - ఒక రమణీయ శిల్పం.

తన్నుతానుతెలిసిన తత్త్వజ్ఞుడామ
హాత్ముడున్న పదమె వారణాసి అతని
మాట మంత్ర మాతని తపో మహిమ, గురుప
రంపరన్ సచ్చిదానంద రాజ్యమగును. --

ఇది 'తపోవనము-గురుపరంపర' అన్న అధ్యాయారంభ పద్యం. ఇది ఒక సూచిక. ఆ అధ్యాయంలో రాబోయే విషయానికి శాఖాచంక్రమణ న్యాయంలాగా. నాటకంలో నాంది లోని వస్తు సూచన లాగా అంకావతారం సూచించే శాకుంతల పంచమాంకంలోని హంసపదిక చూళికలాగా.

ఇందులో వారణాసి. మంత్రమన్న మాటలు మను చరిత్రలో ప్రవరుడు సిద్ధునితో అన్నమాటలను ఆకర్షించటమలావుంచి శంకరుల వారన్న ఈ శ్లోకతాత్పర్యాన్ని చిత్రంగా స్పృశిస్తున్నవి.

కాశీక్షేత్రం శరీరం త్రిభువన జననీవ్యాపినీజ్ఞానగంగా
భక్తిః శ్రద్ధాగయా ------ (కాశీపంచకం)

జపోజల్పః శిల్పం సకలమపి ముద్రా విరచనా
గతిః ప్రాదక్షిణ్యక్రమణం - ఆశనాద్యాహుతి విధిః
ప్రణామస్సంవేశః సుఖ మఖిల మాత్మార్పణ దృశా
సపర్యాపర్యాయస్తవ భవతు యన్మే విలసితమ్ --- (సౌందర్యలహరి)

ఇలా ప్రతి అధ్యాయమింతే. అధ్యాయాలు తొమ్మిది కదా ! ఎందుకు? నవసంఖ్యపూర్ణతా సంకేతం కనుక. సృష్టికి ప్రతీక కనుక నవనాడులు

నవరసాలు- నవకోణాలు- ఇదొకవైదిక విద్యా సంకేతం. శ్రీ అరవిందులన్నారు -వస్తువులతో పాటు సంఖ్యలు సంకేతాలుగానే గ్రహించబడ్డాయని. ఈ ప్రతీకలనేక రకాలంటారు.

Mental Symbols :- instances of which are numbers or alphabets - (చూ. వారి ఉత్తరాలు 2,3 భాగాలు పుట 954)

ఈ దృష్టిని బాడాల కవి లేపాక్షి కావ్యంలో ప్రదర్శించిన తీరును కవిసామ్రాట్టు విశ్వనాధవారు ప్రశంసించారు.

ఇదే అధ్యాయంలో 15 వ పద్యం 'కాయకము సేయకే' వంటి, 'మనసు రీతి విసరెరాగుల నిటనున్న విసురు రాయి' --మాటలు యోగ మార్గములో యోగుల చరిత్రలు చదవక అర్థంకావు. ఒక యిల్లాలు తిరగలి విసురుతుంటే భీతుడై కబీరు గురువుతో వాపోయాడట. "స్వామీ ! నేనూ తిరగలిలో గింజలాగా సంసారంలో నలిగి పోతానేమోనని" విని గురువన్నాడట. "పిడి (ఆత్మజ్ఞానం గట్టిగా పట్టుకో భయంలేద" ని. ఇది తిరగని మనసు రీతి విసరటమంటే

అదే అధ్యాయంలో 35వ పద్యం చాలా హృద్యంగా వుంది.

"అణువణువులో ననుస్యూతమై యడగిన

స్థాణుతత్వంబు " ----

సామాన్యంగా స్థాణువంటే చలనం లేనివస్తువని. కానీ,

పండితుడు తప్ప ఇలా అనలేడు. స్థ+అణు = అణువులో కూడా నున్నది. అని. ---

ఇది రామయ్యగారి సాంప్రదాయ పాండితికి చిన్న ఉదాహరణ మాత్రమే.

తర్వాతి పద్యంలోని "చంద్రసూర్యాగ్నులన్ త్రిలోచనుని తరచు"--- నన్నది కూడా భారతీయ యోగ రహస్యాన్ని వ్యక్తీకరించేదే.

యోగంలో త్రినాడులున్నాయి. అవే చంద్రాగ్ని సూర్యులు. శ్రీ విద్యా సంప్రదాయంలో ఇది చాలా గహనమైనవిషయం. ఇక్కడ త్రిలోచన శబ్దం ఆమూటికీ సంకేతంగా ప్రయుక్తం కావటం చాలా రమణీయంగా వుంది.

ఇది సూక్ష్మశిల్ప విద్యావిషయం.

సుత్తూరంటే ఏమిటి ? ఎక్కడ ? గురుక్రమమేమి ? ఎవరు ? ఏంచేసారు ? ఎప్పటివారు? --ఒక విషయం కాదు. ఆపీఠసంబంధమైన అనేక విషయాలకిది ఒక లఘువిజ్ఞానకోశం.

సుత్తూరట

చోళరాజులు పాలించు కాలమందు ------

శ్రోత్రియపురంబు ---- అది.

ఆరోజుల్లో గాంగ చోళుల యుద్ధాలలో ఆ ప్రాంతం భయంకర శ్మశానంకాగా, ఆది గురువు కరుణించి దాన్ని శాంత పీఠంగా మార్చాడట. దీన్ని సూచిస్తూ ప్రారంభ పద్యం.

ఆత్మ శక్తిని మరిపించి --- వ్రాయబడినది ఆ అధ్యాయ తాత్పర్యంగా 'తలకాడు గాంగ రాజు - సాళువ నరసింహుడు - అనంతపురం జిల్లా లోని హేమావతిని(ఇక్కడ ఒన్నూరప్ప విగ్రహం చాలా సుందరమైనది) రాజధానిగా పాలించిన నోలంబ రాజుల కథలు-- ఇలా అనేక చారిత్రిక ఘట్టాలతో సహితంగా చెప్పబడటం వల్ల కథకొక చారిత్రిక నైపథ్యం సుసంఘటితం కావడం కూడా రచనా విశేషమే.

103 వ పుటలో 26వ పద్యం నాల్గవ వాక్యం - అర్థాంతర న్యాసం కథకంత చిక్కగా అతకటం లేదు. సమాజ శబ్దం -- మనం రాజకీయ సిద్ధాంత దృష్ట్యా వాడుతున్నాం. కనుక. మరి ఇక్కడ ప్రశంసింపబడిన గురువులు సమాజసేవ చేస్తున్నారు కదా ! (ఉదా ॥కు అమృత ఫలాలు -- అన్న అధ్యాయం, పద్యం - 26) తప్పేమిటంటే ---

స్వామి వివేకానందుడు చెప్పిన సామాజికుడు వేరు. రాజకీయ కీయవాచి సామాజికుడు వేరు. బుద్ధదేవుని కరుణ వేరు. మనం చెప్పేది వేరు. మనది కరుణకాదు. ఏమిటో ? -- వివేకానంద వ్యక్తిని తత్త్వానికి తొడుగగా చూచిన వాడు. వాడి కష్టాలతో తాదాత్మ్యం పొందినవాడు. తాత్త్వికదృష్ట్యా సమాజం వేరు. -- కనుక పై అలంకారానికిది సముచిత స్థానమనిపించదు.

తపోవనము - గురుపరంపర లోని 81 వ పద్యం కవికున్న ఆధునిక శాస్త్రపరిజ్ఞాన సంబంధాన్ని తెలియజేస్తున్నది. పురాణేతిహాసాల్లో ఆధునికశాస్త్ర రహస్యాలను వ్యాఖ్యానించే పద్ధతి నేడు ప్రచురమైనది. ఆ విద్యలో ఈ కవి సిద్ధ హస్తుడు. కనుకనే ఈ ఉపమానం వాడ గలగటం.

ఈ కావ్యానికి కిరీట ప్రాయమైన అధ్యాయం తపోవనము - తత్త్వజిజ్ఞాస. దాదాపు 30పద్యాల్లో సాగిన ఈ బ్రహ్మజిజ్ఞాస చాలా నిశితమైన లోజూపు కలవాని రచన తప్ప అన్యం కాదని చెబుతున్నవి.

అధ్యాయ ప్రారంభ పద్యం

" విరికి తావికిని గల చుట్టరికమెంత ? ---

అదే 65 వ పద్యంగా వచ్చింది. కానీ, చివరి రెండు పాదాలు మార్పులు పొందాయి. శిల్పంలో ఇదొక నగిషీ పని. అధ్యాయ తాత్పర్యాన్ని పునఃపునః వ్యక్తం చేయటం వల్ల శ్రోత మనస్సు తాడితమై తదున్మఖీ భీనమౌతుంది. చివరి పాదాల మార్పువల్ల 'ఒక చమత్కారానుభూతి కల్గుతుంది. ఇలాంటి శిల్పంభారతంలో ఆదికవులు చేసారు. 56-57పద్యాలు కవి కాయా దర్శనాలతో వున్న చిక్కని సంబంధాన్ని స్థాపిస్తూ కవికీ కావ్య రచన చేసే శక్తి వుందని ఋజువు చేస్తున్నాయి.

కవిప్రార్థనలో కావ్యభాషాచ్ఛందో రహస్యాలను సూచించాడు. సరళ భాష - కందం - గీత చ్ఛందాలు - పామరులు మెచ్చుకొనే టట్లు వ్రాస్తానని ప్రతిన పూనటం వల్ల ప్రబంధశైలి నిక్కడ వెతకటం - ఆశించటం అనవసరమన్నది స్పష్టం చేసాడు.

అయినా ఈతని పద్యశైలి రమణీయంగా వుంది.

ఈ శరచ్ఛంద్ర చంద్రికా హిమకరార్ద్ర
వాసరము లీవసంత సంధ్యా సమీర
ణాంకురములు - ఈ మనోజ్ఞ పుష్పాకరాంబు
శీకరములేటికో మదిన్ చెదరగొట్టు.

ఇంత బృహత్కావ్యంలో వ్యాకరణ సంబంధమైన నెరసులన్నట్లు సహృదయులు గుర్తించి కూడా ఆవలకునెట్టి ఆస్వాదిస్తారు.

గంగనీటి మీద కూడా ప్రాకుడి - ఆకూ అలమూ ఉంటుంది. ఆ తెట్టెను ఆవలకు కొట్టి మరీ జలాలనాస్వాదిస్తున్నాడు భక్తుడు లేదా ఆర్తుడు.

అలాగే ఈ కావ్యాస్వాదనమున్నూ --

ఈ కవి ఈ నాల్గుమాటలు వ్రాయమని నన్నభ్యర్థించటం కేవలం నాయందా యనకున్న మైత్రీపాశంగా భావిస్తూ --

సెలవు.

అనంతపురం — తుమ్మపూడి కోటీశ్వరరావు

11-8-95

Professor **S. Laxmana Murthy**
Chairman, Board of Studies, Department of English
Kakatiya University, WARANGAL (A.P)

These days very few poets attempt Kavyas in classical style because the free verse is in vogue. And the themes are invariably secular. Hence it is a singularly bold venture on the part of Professor Badala Ramaiah to write a long poem in metrical form on a spiritual theme. In fact,Telugu poetry in traditional metres is soft, sweet and musical. A Telugu *Kavya* in metrical form is always welcome. Its appeal will never fail.

Professor Badala Ramaiah is a well known scholar-poet in Telugu. He has consummate command of Sanskrit and Telugu. He has in addition skill in composing metrical verses with perfect ease. He has established his reputation firmly as Pandita-Kavi with his *Lepakshi Kavya*. About twenty years ago I had the privilege to listen to his recitation of *Lepakshi Kavyas* at Warangal. It was indeed a unique and unforgettable experience. I have found now to my delight his poem *Sri Suttur Guruparampara* to be a worthy successor to his *Magnum opus.* Professor Ramaiah has chosen to compose this poem in *Geetamu* and *Kandamu* the two simple and charming Telugu metres. The great Telugu poets Tikkana and Vemana used these *desi* metres with marvellous felicity. Aptly enough in the introductory verses Professor Ramaih offers prayer to these two poets to bless him with adequate power to compose the poem which has about a thousand verses in it.

*Sri Sutturu Guruparampara* the austere spiritual life of Sri Sutturu Peethadhipathi Sivaratri Rajendra Jagadguru. The beautiful narrative reveals the Jagadguru's multifaceted personality and his cause to the service of education and society. Professor Ramaiah has made it into a superb poem with dignified diction befitting the serene theme. The poem has a whole section devoted to the exposition of Veera Saiva doctrine which like any other philosophical doctrine hardly lends itself to poetic treatment. But it should be said to the credit of Professor Ramaiah that he has succeeded where many pitifully fail.

The life of Sri Rajendra Guru, his spiritual eminence, his compassionate concern for the poor, his unrivalled social service and his many sterling qualities of head and heart are brought in the poem with devout authenticity. The poem has in it quite a few verses which would equal those of the great classical Telugu poets, endowed as they are with the power of Truth and sincerity. The poem is flawless. I am sure that *Guruparampara* will rank as one of the most significant poems written in Telugu in recent years.

# AN OPINION

While I speak a sort of Telugu at home, I don't feel qualified to express an opinion on Dr. Badala Ramaiah's work in poetic Telugu. But after having heard Dr. Ramaiah recite to me passages from a previous work of his Krishnakatha Vipanchi, the life of Sri Krishnadevaraya, where facts of history have been transferred into an imaginative experience I developed high regard for his abilities as a poet.

Presently he has completed an account of a Veerasaiva Matha widely known as Suttur Matha in Mysore because of its sustained service in the cause of education, especially for the rural poor. An esteemed friend Professor S. Lakshmana Murthy of Kakatiya University has written a foreword to it from his inwardness with Sanskrit and Telugu. And so I feel bold to express my admiration for the poet. I have gathered from close quarters that the Suttur Matha has an antiquity of one thousand years; such a sustained continuity could not have been possible without an inner strength imparted by a Parampara of Gurus, starting from the Adijagadguru acknowledged alike by the rival chiefs of the warring Cholas and Gangas because of the primary of his spirit.

Dr. Ramaiah divides the poem into two sections : Tapovanamu and Amritaphalalu, the first part depicting the religious foundation acquired by Tapas which alone can blossom into fine flowers and fruits. His chief concern, however, is with Jagadguru Sri Shivarathri

Rajendra Swamiji of yesteryears. Dr. Ramaiah had known the Swamiji personally and respected his dedication to the spirit of service after having been exhorted by Sri Gowrishankara Swamiji of Sri Panchagavi Matha of Mysore who was at Kasi at that time.

I have been impressed by the poet's high opinion of the Swamiji especially as he is neither a follower of the Swamiji's religion nor sect and so like to think what he says has a true poet's disinterestedness. He closely follows Rajendra Swamiji's boyhood, education, pursuit of higher knowledge and his ability to cut across castes in a caste-ridden society. What has moved the poet most is the Swamiji's compassion and tolerance for what is different from his own faith and pursuit.

The poet ends with the passing away of the Swamiji which brought to the small town of Suttur people of all castes, classes and professions to pay their homage to someone who had risen above commonality in the life of the spirit, Indeed, the place has acquired the sanctity and prestige of a pilgrim centre inducing visitors to circumambulate the Matha - took go round it in devotion.

It is my strong wish that Dr. Ramaiah's poetic work should find a large readership worthy of its poetic excellence.

**Padmabhooshan Professor C.D. Narasimhaiah,**
*Director, Dwanyaloka*
*Mysore.*

# తొలి పలుకు

దాదాపు వెయ్యేండ్ల చరిత్ర కలది సుత్తూరు. ఇది కర్ణాటక రాజ్యమున మైసూరు జిల్లా కపిలా నదీ తీరమున కలదు - వీర సింహాసన మహాసంస్థాన మఠమని ఇది ప్రసిద్ధిగాంచినది. సుత్తూరు పీఠమునకు వీర సింహాసనమన్న బిరుదు ఆది గురువుల కాలముననే చోళగాంగరాజులచే సంక్రమించినను ఈరాజులరాజ్యదాహముచే నాడీభూమి రక్తసిక్తమైపోయెను. ప్రజలలో శాంతి నశించెను. వలసపోయెడి ప్రజలను చూచి గురువుల మనస్సు వెత చెందెను. ఈ మహాత్ముని కలత చూచి చోళ గాంగ రాజులు తమ కత్తుల పారవైచి గురువులకు పాదాక్రాంతులైరి. కత్తులు సాధింపలేని శాంతి ప్రజలకు గుర్వనుగ్రహమున ప్రాప్తించుటచే "వీరులన్న ఆదిగురువులే సింహాసనమన్న వారిదే " యని వారు గురువును ప్రశంసించుటచే నాటి నుండి యీ పీఠము వీరసింహాసనమైనది. ఈయాత్మశక్తి చేతనే యీపీఠము దేశక్షేమమునకై నిరంతరము శ్రమించుచున్నది. ప్రజలలో శాంతి పండితులలో ప్రజ్ఞాప్రచోదనము ప్రాణివర్గమునకుఅభయ ప్రదానము గావించుటయే యీ మఠముయెక్క మహదాశయము.

ఈపీఠాధిపతులందెందరో స్వతఃతాము కవిపండితులై కవిపండితులకును ఆశ్రయదాతలై యుండిరి.అట్టవారిలో ఈ పిఠమునకువచ్చిన నాల్గవ గురువు సిద్దనంజ దేశికేంద్రుడు ప్రముఖుడు. ఇతడు పరమశివాధిక్య చూడామణిఅను ఆధ్యాత్మిక గ్రంథమును వ్రాసిపేరు పొందెను. ఇతని తరువాత వచ్చిన నంజుండదేశికేంద్రుడు శివ లింగదేవ కవిని పోషించెను. ఈ కవిఅముగి దేవయ సాంగత్యమును వ్రాసి గురు కృపకు పాత్రుడగుటయేగాక కన్నడ ప్రజలగౌరవమును పొందెను. తోంటద సిద్దలింగయతికి శిష్య శ్రేష్టుడగు ఘన లింగ శివయోగి స్వతంత్ర వచనకారుడై నేటికిని రసజ్ఞుల నోటిలో మెదలుచున్నాడు. ఈ మఠమునకు గౌరవ పాత్రుడైన గౌరీ శంకర స్వామి సంస్కృతకర్ణాటకభాషలలో మహా పండితుడే గాకకవి వరేణ్యుడు కూడ.అక్క మహాదేవి చరిత్రను చంపూకావ్యముగా వ్రాసెను. ఈ గ్రంథముతో పాటు ఘనలింగ శివయోగి వచనములను పరిష్కరించి రాజేంద్ర గురుతిలక జగద్గురు రాజేంద్ర గురువులు ప్రకటించిరి. ఈ పీఠాధీశ్వరుడు కవి పండింతుల పోషించుట యేగాక దీనదళితులకాశ్రయ కల్పవృక్షమై యుండెను. ఈ మహాత్ముని సర్వతో ముఖసేవచే యితని కీర్తి కన్నిడిగుల యందేగాక పొరుగు రాష్ట్రములయందును వ్యాపించెను.

ఈ మఠము స్థాపించినఅనేక ధార్మిక సంస్థలలో జగద్గురు శివరాత్రీశ్వర గ్రంధమాల ఒకటి. దీని ఆధ్వర్యమున ఎన్నియో గ్రంథములు ప్రకటితమై ప్రజా సంస్కృతికి తోడ్పడుచున్నవి. నేడీ తెలుగు "సుత్తూరు గురు పరంపర." కావ్యమును ప్రకటింపనిది ముందుకు వచ్చినది. ఇది కర్ణాటాంధ్రులకు రస సేతువుకాగలదని ఇప్పటి సుత్తూరు శ్రీ జగద్గురు దేశికేంద్ర స్వాములు ఆశించి శివరాత్రీశ్వర ధార్మిక నిధి సహాయమున దీనిని ప్రకటించుటకు శివరాత్రీశ్వర గ్రంధమాలను ఆశీర్వదించిరి వారి యీ మహోదార ప్రవృత్తికి మాభక్తి పూర్వక నమస్కారములు. ప్రసిద్ధకవి విమర్శక పండితులగు డాక్టరు బాడాల రామయ్య గారికి మా కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు. ఈ పుస్తకమును సుందరముగా ముద్రించిన ఆత్రేయ ప్రొసస్ ప్రై. లి. వారికి మా వందనములు. రసజ్ఞులకీ గ్రంథము స్వాగతార్హము కాగలదని మా విశ్వాసము.

ప్రకాశకులు

శివరాత్రీశ్వర గ్రంధమాల

మైసూరు.

# శుభాకాంక్ష

జగత్కల్యాణమునకై మహాత్ములు భూమిపై అవతరించిరి వారు సాధించిన మహత్కార్యములు ఉపదేశించిన సందేశములు స్థాపించిన సేవా సంస్థలు బ్రతుకును ప్రకాశింపచేయును. ప్రజల దైనందిన జీవితమున ఒక ఆధ్యాత్మిక జాగృతిని కల్గించుటయేగాక జగదౌన్నత్యమునకు శ్రమించు మహాత్ముల జీవన స్రవంతి ప్రజా హృదయాంతరాళముల సదా ప్రవహించుచు వారిని పవిత్రుల చేయగలదు. ఈ కోవకు చెందిన ధార్మిక పీఠములు మరియు ధర్మ ప్రదీపకుల సూలముగనైన భారతీయ భాషా సాహిత్యముల ద్వార పరిచయము చేసినచో సర్వ ధర్మ సమన్వయమే గాక రాష్ట్రభావైక్యతల తప్పక సాధ్యమగుననుటలో సందేహము లేదు.

ఈ దృష్టితో చూచినపుడు సుత్తూరి క్షేత్ర చరిత్రను దెల్పు " సుత్తూరు గురుపరంపరా" యను యీ తెలుగు కావ్యమాదరణీయ మగుటయేగాకఅమూల్యా భరణమని చెప్పవచ్చును. ఈ శ్రీ పీఠముకు జగద్గురుల చరిత్ర కన్నడమున గద్య, పద్య కావ్య నాటక రూపముల ప్రకటీతమై ప్రచారము నందుకొన్నది. తమిళము, ఆంగ్ల భాషలయందును ప్రకటితమైనది. ఇప్పుడిది తెలుగు భాషలో రామయ్యచే కావ్య రూపమున వెలువడి ఆంధ్రభాషా బాంధవులకు చేరువయగుచుండుట ముదావహము.

"సుత్తూరు గురుపరంపరా" ఈ కావ్యకర్త ప్రాచార్య డా।। బాడాల రామయ్యగారు సుప్రసిద్ధ తెలుగు కవులు కన్నడ, ఆంగ్ల, సంస్కృత సాహిత్యము లందును విద్వాంసులు. విలువైన కృతి రత్నములచే వీరు తెలుగు సాహిత్యమునకు విశేష సేవచేసి గౌరవమును గడించినారు. తమ విచార ప్రపూర్ణమైన సమగ్ర సమీక్షతో బసవన్నగారి వచనముల ఆంధ్రీకరించి లబ్ధప్రతిష్ఠులైయుండుట ఇట స్మరణార్హము.

సుత్తూరు గురుపరంపరను గూర్చి సంక్షిప్తముగ జగద్గురుడా శ్రీ శివరాత్రి రాజేంద్ర మహాస్వాముల బహుముఖ కార్యక్షేత్రములకత్యంత సన్నిహితు లగుటచే యీ కవి పారవశ్యముతో వాటిని ఈ కావ్యమున వివరించి నిరూపించిరి. శ్రీ పీఠము యొక్క గురుపరంపరను తెలుగు సాహిత్య ప్రపంచమునకు డా।। బాడాల రామయ్యగారు తమదే యైన విశిష్టశైలిలో సరళముగ పరిచయము సేయుట ప్రశంసింపతగినకార్యము. ఈ కృతి శ్రీ శివరాత్రీశ్వర గ్రంథమాల వారిచే ప్రకటింపబడుట సంతోషింపదగిన విషయము. ఇది తెలుగు సాహిత్యమునకు అమూల్యాభరణమగు గాక. డాక్టరు బాడాల రామయ్యగారిచే యింకను ఉన్నత సాహిత్య సేవ జరుగుగాక. వారికి భగవంతుడు సకల శ్రేయస్సులు ప్రసాదించు గాక.

శివం భూయాత్

ఇత్యాశీషః

# కృతజ్ఞతలు

" సంకట సమయములో వెంకటరమణా " అన్నట్లు కష్టాల్లోనే సుత్తూరు మఠాన్ని ఆ గురువులను చూచే వాణ్ణి. ఏది ఎట్లున్నా శ్రీ శివరాత్రీశ్వర రాజేంద్ర స్వాములు పలికే దేవుడునాకే కాదు అందరికీ కూడ ఉద్యోగరీత్యా నేను బెంగళూరికి పోవలసి వచ్చింది. నాటితో ఆ మఠం నాకు కొంత దూరమైంది. ఒకనాడు రాజేంద్ర గురువులు లింగైక్యమైనట్లు వార్తా పత్రికలలో చదివినే నెంత కూలిపోతినో. నాటి నా మిత్రులకే దెలుసు. ఏదో విధంగ ఏడేండ్లు బెంగళూరు విశ్వవిద్యాలయంలో గడిపి మరలా మైసూరు చేరు కొంటిని. నేను ఉద్యోగం వదలితినే గాని నన్ను రోగరుజనాదులు వదలలేదు. నా ఆరోగ్యము దినదినం క్షయించు చుండెను. కనుచూపు మాద్యమయ్యెను. ముప్పుపై బడెను. బైట ప్రపంచానికి దూరమై నిరుత్సాహంతో ఇంటిలో బడి యుంటిని. నా అనారోగ్య స్థితిని విని సుత్తూరు మఠమే నా దగ్గరికి వచ్చెను. ఎంత వలదన్నా వినక నన్ను హొసపేటకు కారులో తీసుకొని పోయి బ్రహ్మాండముగా సత్కరించెను. ఉచితంగా నాకు చికిత్స చేయించెను. నాలో కొండంత ఉత్సాహాన్ని నింపెను. నా ఆరోగ్యం కొంతమెరుగయ్యెను. మరలా కనుచూపు వచ్చింది. ఆ సుత్తూరు గురువులు చేసే సార్వజనీన సేవ, సర్వమత సమాదరణ, దినమూ వేలాదిమంది పేద విద్యార్థులకు ఉచిత భోజనము, శతాధిక్య విద్యా సంస్థల నడుపుట కవి పండిత కళాకారుల ప్రోత్సహించుట వారి ధార్మిక సంస్థలు ఇవి అన్నీ నన్ను ముగ్ధుణ్ణి చేసింది. శ్రీ మఠం చరిత్ర ఆ గురువుల మహత్కార్యాలు తలంచినంతనే నాలో క్రొత్త ఉత్సాహం వెల్లుబికింది. మఱుగై పోయిన రచనా శక్తి మరలా తొంగి చూచి యీ సుత్తూరు గురుపరంపరా కావ్యానికి నాందీ పాడింది.

ఒకనాడిప్పటి సుత్తూరు పీఠాధిపతులగు శ్రీ దేశికేంద్రుల వారితో మాట్లాడుతూ యీ కావ్యాన్ని గూర్చి కొంత తెలిపితిని. వారు నా ఆరోగ్యముతో పాటు కవితా వ్యాసంగానికి మిక్కిలి సంతోషించిరి. ఒకనాటి రసజ్ఞుల సమావేశంలో యీ కావ్యగానం ఏర్పాటయ్యెను. అట చేరిన మిత్రులీ కావ్యమాద్యంతం వినవలెనని పట్టుబట్టిరి. ఇది తెలుగు కదా అంటిని. అయితే మాత్రమేమి. ఆయాత్మ మాదే "అనిరి. దానితో నా ఉత్సాహం ద్విగుణీకృత మైంది. కన్నడ ప్రాధ్యాపకులై యుండిన డా॥ తిప్పేరుద్ర స్వామి, సంస్కృత, ఆంధ్ర, కన్నడ

 

భాషాభిజ్ఞులు. దర్శనాలపై డాక్టరేటు పొందిన సంస్కృత ప్రాధ్యాపకులై మఠాధిపతులై యున్న శ్రీ శివ బసవ స్వామి ఫిలాసఫీశాఖలో ఆచార్యులై యున్న శ్రీ శివరుద్రప్ప కన్నడ ఉపన్యాసకులగు శ్రీ నంజుండయ్య ఆంగ్ల భాషా కోవిదులై ఆచార్యులైయున్న శ్రీ చంద్రశేఖరయ్య న్యాయవాది వృత్తిలో నున్న గంగాధరయ్య ఇంకను కొందరు మఠాధిపతులు నా కావ్య మాద్యంతము విని సంతోషించి అక్కడక్కడ కొన్ని మార్పుల సూచించిరి. వీరు తెలుగు వారు కారే కాని వారి వారి శాఖలలో వారు కొమ్ములు తిరిగిన పండితులు. రచయితలు చక్కని సంస్కారమున్న విమర్శకులు. ఈ యన్నింటికి మించిన కావ్య మాధుర్యాన్ని ఆస్వాదింపగల రసజ్ఞులు సహృదయులు. కన్నడ నాడున ఇట్టి వారిముందు నా కావ్యపఠనము జరిగి వారి మెప్పుల బొందుట ఈశ్వర విలాసము గాక. ఏమన వలెనో తెలియుట లేదు. ఇంతేకాదు తెలుగు కన్నడ భాషల హృదయ మెరింగి కర్ణాటక విశ్వవిద్యాలయమున కన్నడ ప్రాచార్యులై యున్న శ్రీ వృషభేంద్రస్వామి యీ కావ్యమును విని తప్పక ముద్రింప వలెనని సుత్తూరి పీఠాధిపతులగు శ్రీ దేశికేంద్రులవారికి విన్నవించిరి. శివరాత్రీశ్వర గ్రంథమాల వారు దీనిని ప్రకటింప ముందుకు వచ్చిరి. దానికి శ్రీ దేశికేంద్ర స్వాములు సంతసించి నన్నాశీర్వదించిరి. ఈ యందరి మహోదార ప్రవృత్తికి, ఆదరాభిమానములకు నేనెంతయో కృతజ్ఞుడను.

అడుగగనే ఈ కావ్యమునకు తెలుగులో మున్నుడి వ్రాసిన కవి పండిత మిత్రులు, కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో ఆంధ్ర శాఖాధ్యక్షులై యుండిన డాక్టరు కోటీశ్వర రావుగారికి, అభిప్రాయము పంపిన జ్ఞానపీఠ పురస్కార గృహీత పద్మభూషణ ప్రసిద్ధ కవిశేఖరులగు డాక్టరు సి. నారాయణ రెడ్డి గారికి, ఆంగ్లములోమున్నుడి వ్రాసిన వరంగల్ యూనివర్సిటీ ఆంగ్ల ప్రాధ్యాపకులగు శ్రీ ఎస్. లక్ష్మణమూర్తి గారికి, అభిప్రాయమిచ్చిన నివృత్త ఆంగ్ల శాఖాధ్యక్షులు, ధ్వన్యాలోక సంస్థాపకులు, పద్మభూషణ బిరుదాంకితులగు శ్రీ సి.డి. నరసింహయ్య గారికి నా హృత్పూర్వక కృతజ్ఞతలు. కావ్య రచన సాగునప్పుడు కొన్ని కన్నడ గ్రంథములు చదివి వినిపించిన కుమారి టి.వి. భవానికి పుస్తకము చక్కగా ముద్రించిన భరద్వాజ్ మరియు ఆత్రేయులకు నా అభివందనములు.

బాడాల రామయ్య

# విషయ సూచిక

# ప్రార్థన

గణపతిచే మూలబలం
బును, వాణి కృపా విశేషమున, వరకవితా
గుణముల్, శివ సంస్మరణన్
అనుపమసాయుజ్యమంద, నందర కొలుతున్ ||     1

నవయుగ నిర్మాణము, మా
నవతా ధర్మంబు, నిర్గుణ సగుణతత్త్వం
బవలోకించు పథంబును,
శివశరణులెఱుక పరచిరి జీవుల కెల్లన్ ||     2

ఏకాంత ప్రియులయ్యును,
లోకాలోకంబుల గల లోకుల నెల్లన్
ఏకాకృతి తలపోసెడి,
ఆకాలజ్ఞుల గుణంబులభివర్ణింతున్ ||     3

వారలెంత వైరాగ్య తత్పరులొ అంత
రాగరససిద్ధులెంత ధర్మాభిరతులొ
అంత నిష్క్రియాఘనులా, మహాత్ముల మహి
మ లెరుక పడి నంత రచింతు మనసు పొంగ ||     4

మధుర సువర్ణాక్షరముల,
మధుమాస సమీర లతిక, మైమరపింపన్,
ప్రథిత శివరాత్రి గురువుల
కథ నంబొనరింతునాంధ్రి గర్వించునటుల్ ||     5

అందంబులచిందించెడి,
కందంబుల పొందు పరుప, కవికులబ్రహ్మన్,
డెందంబున మ్రొక్కెద నా
ఛందోమర్మంబు తెలియ, సద్యస్ఫూర్తిన్ ||     6

ఆంధ్రి జీవనాడియై, పైడి తీవగా
పలుకు పలుకునందు బ్రహ్మ మరసి,
విశ్వ వీణ మీటి వేమన్న పాడిన
ఆట వెలది సొగసు నాత్మ దలతు ॥ 7

గురు పరంపర రాజేంద్రగురుని గాథ
మధ్యమ మణియై, సుత్తూరు మఠ చరిత్ర
సరళమగు మాతృభాష పామరుల మెచ్చ,
చేతు నాంధ్ర కర్ణాట రసికులలరగ ॥ 8

గురువుల ఉపనిషద్వాణి, పరవశించి
తెలుగు బల్కుల కమ్మని తేనెలూర,
కన్నడాంధ్రుల హృదయ సంగమము కాగ,
సేతు వై భావగీతి సృజించుకొందు ॥ 9



కవులు యోగులు ఋషులు సుజ్ఞాన ధనులు
రాజనీతి విశారదుల్ రసికులు కవి
పండిత జన పోషకులునుద్దండ చరితు
లెందరో యిట తరియించిరిల ఫలింప ||

# తపోవనము
# ఆదిగురువు

అది, మహాశివరాత్రి, హరాంకిత పద
భృంగమొక్కటి, శివశక్తి, పృథివి చాట,
పద్దియవ శతాబ్ది, కన్నడావని చరించె,
శ్రీ సుతూరి సింహాసన శ్రీలు చెలగ ॥ 1

తపము, దానంబు, ధర్మము, దయ, అహింస,
సత్య, శౌచంబు, లాత్మ వాసనలు మెరయ,
అవియు, వైరాగ్యమూర్తిగ, నవతరించె,
సిద్ధగిరినాది గురుడై, ప్రసిద్ధినందె॥ 2

సంధ్యలందు, నర్కావతిన్, జలకమాడి,
పరమమాహేశ్వర ప్రభల్, పరిమళింప,
క్రొవ్విరులతోడ, తీర్థంబుకొంచు, నాత
డాశ్రమంబున కరు దెంచు, ననుదినంబు ॥ 3

చిత్తమా శివపదమున, చిక్కు కొనగ,
ప్రాకృత శరీరధారియై బ్రతుకు, నతని
కా ఉమా మహేశ్వరులె, మాతాపిత లిల,
ఋషుల, నదుల, మూలంబులనెవ్వడెరుగు ॥ 4

కదలు చుండియు, నిల్చున్ననది విధాన,
దేశకాలస్థితిగతుల తెలిసియు, నత
డబ్జపత్రాంబకణమౌచు, హర వియోగ
తా పిత హృదయుడై, నిరతంబు వేగు ॥ 5

ఈశరచ్చంద్ర చంద్రికాహిమకరార్ద్ర
వాసరము, లీ వసంత సంధ్యా సమీర
ణాంకురము, లీ మనోజ్ఞపుష్పాకరాంబు
శీకరము, లేటికోమదిన్, చెదరగొట్టు ॥ 6

నిన్ను చూడని కన్నులు కన్నులె ? నిను
చేరి గొల్వని చేతులు చేతులె ?, నిను
పల్కనేరని నాల్కయు నాల్కె ?, హరహ
రా! మహాదేవ! నిను వీడి, బ్రతుకుటెటులొ? ॥ 7

నీవు లేని యీనేల, యెండిన ఎడారి,
నీవు లేని యీ నీరు, కన్నీరు, నీవు
లేని యీ కాంతి నన్ను కాల్చి, మసి చేయు,
సతతమీ సృష్టి చంపియు చంపకుండు ॥ 8

ఎంతకాల, మీ రీతి, వేధింతువయ్య!
నిన్ను చూడ కిక తృటియేన్, నిలువలేను
నేటితో నా బ్రతుకు తీరు, నిన్ను కనని
రాత్రి శివరాత్రియే? శవరాత్రి గాక॥ 9

అసలు నీ వుంటివో ! లేదొ! యనెడిశంక
పుట్టె ! లేనిచో నేనెట్లు పుట్టినాడ !
ఉన్నచో నేటికిటు లొంటి నుడుకుచుంటి,
ఒక్కటియు తోచకిట, మతి ముక్కలయ్యె॥ 10

తనువు కన్నులై, నిను చూడ తహతహపడు,
చెవులె బయలౌచు నినువిన చింతచేయు
మనసు సకలేంద్రియంబులై, మరులు రేపు
దిక్కు తోచక, వెడగునై తిరుగుచుంటి ॥ 11

హరివిరించులే, నిను చూడ నలమటింప
ఇంక సామాన్యుడెట్లు దర్శింపగలడు ?
నిన్ను చూడని బ్రతుకిలనిల్వదనుచు,
అన్నపానంబులన్ విడి, అతడు వ్రాల,॥ 12

లెమ్ము లే లెమ్ము వత్స ! ముదమ్మగు నను
శబ్ద మమృతసేచనముగ, శ్రవణమంట,
శబ్ధ మర్థమై, అర్థము, స్పష్టమగుచు,
రూపు కట్ట, కట్టెదుట, గురుండుదోచె|| 13

భస్మరేఖలు నొసటిపై, పరిమళింప,
చెవులరుద్రాక్షపోగులు చవుకళింప,
కావుల హుతాశన జ్వాల గవియుచుండ,
జంగమాకృతి ఒకడు సాక్షాత్కరించె|| 14

చుక్కతెగిపడినట్టులా, సుందర ప్ర
భాతమున, కట్టెదుట నిల్చి, పరహితార్థ
దృష్టిసారించి, శివయోగనిష్ఠమెరయ,
ఆదిగురుని కన్నులకనుల్ అతడు సేర్చె|| 15

ఆత్మకజ్ఞాత సౌఖ్యమ్మునలమ, శాంతి
హృద్విభావరి చంద్రిక లీనుచుండ,
మేను సాంధ్యరాగమ్మున మెరయ, స్ఫటిక
సుందరస్వామినే మదిన్ జూచె గురుడు || 16

చూపున జ్యోత్స్న, పల్కులతీపి, పెదవు
లందు చిరునవ్వు చిందగ, నంతకంత
మధుర భావంబు లూరించి మరులు గొలుపు,
సంభ్రమిత గురున్ జూచుచు, జంగమయ్య|| 17

సూర్యచంద్రులు సాక్షిగా చూచుచుండ,
పరిమళంబులు చల్ల ప్రభాత వీచి,
ప్రమథులై పక్షులు, శుభంబు పలుకు చుండ,
ఆత్మతేజమా గురుని యందావహించె|| 18

అంత తృణ రేణు కాష్ఠమధ్యాంతరప్ర
భావమెరిగి యెల్లడ శివ భావమందు,
రేణుకాచార్యుడంచు, దర్శించి, తను, ను
తించు నాదిగురునితో వచించె నతడు|| 19

తలపులోన, సకల కార్యములఘటించు
శక్తి, నీ యందు కలదయ్య, సాధుమూర్తి
సార్వకాలిక జ్ఞాన ముజ్వలత మెరయ,
జగతి చరలింగమూర్తి వై సంచరింతు|| 20

భక్త, మాహేశ్వర, పసాద, ప్రాణలింగ,
శరణ, ఐక్యస్థలంబుల, స్వానుభవము
శివుడవై పొంది, నిల్తువో చిద్విలాస!
వీర సింహాసనాధ్యక్ష! విమల తేజ! || 21

మనపురాతన ధర్మంబు మహి వెలుంగ,
ప్రణవ పంచాక్షరీ ప్రభావంబు తెలియ,
సర్వదా సదాచార సంస్కారి వగుచు,
ప్రజలకాదర్శ గురుడవై, బ్రతుకుమన్న! || 22

వెట్టి నూరు గోవిందలు పెట్టవచ్చు,
బండి పత్తిరి, శివుని పూజింపవచ్చు,
కాని కాకి నెంగిలి చేత కదపని ఖలు
మోయలేనను భూదేవి మొరలు వినవా! || 23

ఈ యఖండ భూవలయంబునేలవచ్చు
సకల వేద శాస్త్రంబుల, చదువవచ్చు
పూని అద్భుత శక్తుల పొందవచ్చు,
కాని దీనులన్ శివుచూడ, కష్టమయ్య! || 24

క్షుత్పిపాసుల కమృతాన్న సురభివగుచు,
ప్రబలు తమ సాంద్ర జగతికి భానుడగుచు,
పేదలకు పెన్నిధానమై, వెలుగుమయ్య,
శ్రోత్రియ పురంబు క్రొంగొత్త శోభమెరయ ! || 25

జగముల శివాను రక్తిని సంస్కరింప,
కావిబట్టలు గట్టు జగద్గురుడవు,
వర్ణవర్గభేదంబుల పరిహరింపు
మయ్య! "యేకమే వాద్వితీయం" శివమన ! || 26

వెలిగెడి తేజోనిధివై
కలికల్మషహరుడవగుచు, కర్మలడంగన్,
నిలచు జ్ఞాన ప్రదుడవు,
పలికెడి దేవుండవగుదు, ప్రజలందరికిన్ || 27

అడుగకయె యీప్సితార్థంబు లందరికిడి,
తనకు బూదిరుద్రాక్షలదప్ప, అన్య
మేదియునభిలషింపని, యీశ్వరు, తరు
ణేందు శేఖరు, తత్త్వమే, హితము మనకు || 28

పోయి కపిలానదీ పుణ్య తీరమందు,
నిలిచి శివరాత్రి గురుడవై వెలుగు మయ్య,
ప్రమథ గణములు నీ వెంట వత్తురింక,
ప్రకృతి ఆ పరమేశ్వర ప్రణయభూమి. || 29

లేని ప్రజకు ప్రసాదంబు లేమి బాపు,
ఉన్న ప్రజకు ప్రసాదమ్ము నూర్జితవర
మగు, కలిమిలేములకతీతమౌ, ప్రసాద
మాత్మ గురుడిచ్చునని మాయమయ్యెనతడు ! || 30

ఆత్మశక్తిని మరపించి, అహరహంబు
అహాము త్రిప్పెడి బొమ్మలై, ఆడుచున్న
జీవకోటిని తరియింప చేయ, గురుని
కరుణ శరదిందు చంద్రికా స్ఫురితమయ్యె ॥

# సుత్తూరు

చోళరాజులు పాలించు కాలమందు,
వేదమంత్రనాదముల పవిత్రమగుచు,
శ్రోత్రియపురంబునా, మెప్పు సుప్రసిద్ధ
పదమె, సుత్తూరుగా నేడు ప్రణుతి గాంచె॥ 1

ఆదిగురునికాలమున భయంకరముగ,
గాంగ చోళరాజులకు సంగ్రామమయ్యె
ఆరని నృపుల రాజ్య దాహంబు, నెత్తు
టేళ్ళతో గాని, యీ భూమి తృప్తిపడదు॥ 2

ప్రజలలో శాంతి నశియించె, బ్రతుకుచితికె,
పూట కూటికి కరువయ్యె, పొట్టచేత
బట్టి, ప్రజలు దేశాంతర వాసులైరి
నృపతులజిగీష, ప్రజకు కార్చిచ్చునయ్యె॥ 3

అంత సాధువర్యుడు, తపోధ్యానశీలు
డంతరింద్రియ బహిరింద్రియంబులన్ జ
యించు, నిష్టాగరిష్టుడు, నిష్టలింగ
ధరుడు, సుత్తూరు నా దిమ గురువరుండు. ॥ 4

ఒక్కనాడు, సంధ్యా సమయోచితముగ
స్నానమొనరించి, ప్రణవ పంచాక్షరిన్, జ
పించుచు, నిజాశ్రమమునకేతెంచు గురుని,
జనులు చూచి, దుఃఖార్తితో సాగిలబడి॥ 5

అయ్యగారిని, గొల్చుభాగ్యమికమాకు
తీరిపోయె, యీ భూమిపై దేవ! క్షేమ
బ్రతుకలే మేటకేనియు, పారిపోదు,
మాజీ, నీల్వదు, యమ భటులైరి భటులు ॥ 6

అనుచు దీనవదనులై, ప్రజల్ వాపోవ,
గురుని మనసు, సుళ్ళుతిరిగె కలత,
నంతలో మహాశ్వమరుదెంచి యొక్కటి,
చూడ నతని చుట్టి చుట్టి నిలచె॥ 7

అశ్వారూఢుండగు మను
జేశ్వరు, డొకడాయెడ దిగి, యింగితమతి, మా
హేశ్వర విభవాస్పద తే
జస్విగురున్, చూచి, మ్రొక్కె, సంభ్రమ పరుడై ॥ 8

గురుని నేత్రకోణంబుల మెరసెకరుణ,
ప్రజల జూచుచు చూడగ ప్రభుని వంక
ప్రభుని దేహంబు గడగడ వడక, శిరము
వంచి తప్పిదస్తునిగ, ఆ తపసి ముంధు॥ 9

ఏ మహాశక్తివిచ్చెనో స్వామి కనుల,
మంత్రముగ్ధుడై, నృపుడు నమస్కరించె,
కఱకు కత్తుల తెగనట్టి గంటులెల్ల
క్షణముల్లో తెగె, గురుని ప్రసాద దృష్టి॥ 10

ఆశ్రమాభిముఖుండయ్యె నాదిగురుడు,
తల్లి వెన్నంటి నడచువత్సలము రీతి,
అతని యడుగుజాడలబట్టి అమిత భక్తి
చేరవచ్చిన నృపుజూచి, చిద్గురుండు॥ 11

రమ్మిదే పులి చర్మ పీఠమ్ము గొనుము
చోళ నృపులు, శైవాగమ సూరి వరులు,
సంతత శివార్చనాపరుల్, శౌర్యనిధులు,
సాధు సన్మార్గవర్తనుల్, సహనయుతులు॥ 12

అన్న! శివశక్తి నీ కంటనాడుచుండె,
నీవు, మనుజమాత్రుండవే ? నిక్కమరయ
విశ్వకల్యాణ మూర్తివి, విమలతేజ
నీ మహా శక్తి జగతికి నిత్యరక్ష|| 13

అనెడి సాధువర్యుని మాటకచ్చెరువడి,
నృపుడు పులకితగాత్రుడైనిలచె, నంత
కంత తమ దర్శనార్థమై, అరుగుదెంచె
గాంగవిభుడంచు, చెంత చేరంగ భటుడు|| 14

గురుని ఆజ్ఞతో గాంగరాజరుగుదెంచి,
కత్తి దీసి, గురుచరణ కమలము కడ
నిడి, శిరము వంచి, సాగిల పడ, గురుండు
చంద్రమౌళిని దలచుచు సాదరమున|| 15

లెమ్ము గాంగమహీపతీ! రమ్మితండు
వీరమాహేశ్వరాచార విభుడు, మనకు
వలసిన మహాత్ముడీయెడ పగకు తావు
లేదు, శివుని రాజ్యంబులో చేదు గలదె ? || 16

అన్నదమ్ములు దాయాదులగుదురాస్తి
పంపకంబున, కాని శివ ప్రసాద
మంది, సతతమేకాత్ములై అనుభవింతు
రిలను, భోగోపభోగులై యెల్ల జనులు|| 17

అర్థ గర్భిత వాక్యంబులాలకించి,
వారలిరువురు, స్వామి పార్శ్వమున నిల్వ
గురుని కరములు, వారల శిరములంటె
మంగళాశీస్సులంబోసె, మౌని మనసు|| 18

ఆ. నృపాలసింగంబుల యాత్మ యాత్మ
కలియ, శివగురుసన్నిధిన్ కౌగిలించి
రిద్దరు, నపూర్వ అనుభవంబెదలనిండ
అవని శాంతి వాయువు లలనల్ల నలమె॥ 19

సహజవైరి మృగంబులే, సాధువరుల
ఆశ్రమంబున ప్రీతి నాటాడు కొనగ,
మనుజులరుదె, యేకాత్మలై మనగ? సత్య
మయ్యె సర్వము ఖల్విదంబ్రహ్మమనుట॥ 20

విశ్వ కల్యాణ మూర్తులు, వీర వరులు,
మీరె దేవ! యీ పీఠమే వీర పీఠ
మిట్టి సిద్ధ పురుషులున్న, యీ స్థలాన
మట్టి కణముల మహిమలు పుట్టుటరుదె? ॥ 21

ఈ స్థల ప్రభావమెంతని మేము స్తు
తింపగలము, దేవ! తేజి చుట్టి
చుట్టి నిలచెగాన, సుత్తూరుగా నిది
వన్నె కెక్కుననిరి, ప్రభువులప్పుడు ॥ 22

గాంగరాచమల్ల, కంచి రాజేంద్రచో
ళ నృపులాప్త మిత్రులైరి, ఆది
గురుని దయ అహంబు కూర్మిగాన్, సుత్తూరు
శాంతికేంద్రమయ్యె, జనులు మెచ్చ॥ 23

సంధి కుదుర, గాంగవిభుడు, స్వాంత మలర,
సెలవుగైకొని స్వస్థలిన్ చేరుకొనియె
కట్టెదుట నిల్చు చోళ భూకాంతునల్ల
పొర్లచూచి, కాలజ్ఞుడై పలికె గురుడు ॥ 24

రాజరాజ తనయ! రాజేంద్ర చోళ, క్ష
మ్మాభి రామమైన ఆత్మశక్తి,
ఒరనడంగుకత్తి, ఉత్తముని తపంబు,
సాధ్వి గుణము రీతి, జగతి గాచు ॥ 25

అయ్యా! నీ కీయశ్వము
కయ్యంబున గెలుపు నిచ్చు గంధర్వుడు, నీ
వయ్య క్షేశుండవు, మీ
రియ్యల శైవ మలర జనియించితిరిట పై ॥ 26

నీ వన ప్రాణము దీనికి,
యీవిశ్వాసంబున జనియించును సుతుడై
యీవసుధాస్థలి నీ కిది,
నీ వంశ యశంబునింగి నేలను కలుపున్ ॥ 27

ఇంకొక వర్షంబునకీ
వంకకు చనుదెంతువంచు పలికి, శివ ధ్యా
నాంకిత చిత్తుడగుచు, యో
గాంక సమారూఢుడయ్యె నయ్యతివరుడున్ ॥ 28

చోళ రాజేంద్రుడంతట సుదతి తోడ
కాశికాపురి చేరి, గంగా పవిత్ర
తోయములమున్గె, శ్రీ కంఠు, ధూర్జటిన్, శ
శాంక శేఖరు, సాంబుని, స్తవ మొనర్చె ॥ 29

తృప్తి చెందె జనత, దేశంబు సుఖియించె,
నృపుల శాంతిదాంతి నెలకొనంగ
వాజి యిచట ముందువడకచుట్ట నది సు
త్తూరటంచు, జగతి పేరు పొందె ॥ 30

కాలమాదిమధ్యాంతముల్ కతుకులు బడ
క్రోటి కోటి రూపంబుల కూడె జగతి,
ఋతము ఋషుల వాక్యంబులన్ ప్రతిఫలించి
విశ్వకల్యాణ సృష్టికి విందు గూర్చు ॥

# గురుసందేశము

నియమంబుల పాటించుచు,
నయమార్గముదప్పకుండ నడచుచు, సత్యం
బ, యనుసరించుచు, నెదురౌ
వ్యయప్రయాసల గణింప, డప్పటి గురుడున్|| 1

మూడు ప్రొద్దుల స్నానంబు, మూడువేళ
లిష్టలింగార్చనా విధులిచ్చ సలిపి,
త్రివిధదా సోహమొనరించు, తెరిపి దొరక
శరణ సాహిత్యమున్ చూచు, సత్యమరయ|| 2

ఆది గురు పరంపరాగతంబగు, కార్య
గతుల నెల్ల తప్పక సమయప్ర
కారమాచరించి, కడునిష్ఠకాయక
వ్రతరతుండగు, శివరాత్రి గురుడు|| 3

పాడి పంటలు పరికించు, ప్రజలు మెచ్చ,
పూల తోటల పోషించు, పూజకొరకు,
శరణ కోటికి అనుభవజ్ఞానమొసగు
అతిథియభ్యాగత శ్రేణి నాదరించు|| 4

ప్రణవ పంచాక్షరీ మంత్ర రత్నమాత్మ
నుచ్చరించుచు, వ్రాయుచునోపి నంత
అక్షరక్షరంబున శివధ్యాన చిత్తు
డగుచు, మంత్రమహర్షిగ ఖ్యాతినందె|| 5

వచ్చెడి వారికి లేదన
కిచ్చుచు, నిచ్చినది మరలయిమ్మనడెపుడున్
తెచ్చి మఱి వారెయిచ్చిన,
వెచ్చించును దానినెల్ల పేద లకతడున్|| 6

హరుడై ఆధివ్యాధుల
బరిమార్పుచు, చెంత జేరు బ్రజ రక్షించున్,
గురుడై బుద్ధులు చెప్పుచు
శరణార్థుల కెఱుక పరచు, శంభుగుణంబుల్ ॥ 7

జైన వైద్యుల పిలిపించి, సంప్రదించి
రోగరుజనాదులెల్ల నిర్మూల మంద,
ఔషధంబుల సేయించి, అడలుజనుల
కవసరంబున, తగురీతి ఆదుకొనును॥ 8

అర్థి సనుదెంచు ప్రజకు ద్రవ్యంబునిచ్చు,
ధాన్య మిచ్చు, పరస్పరతగవులబడి,
చెంత చేరిన వారల చింత లెరిగి,
తీర్పుచెప్పి, న్యాయమును సంతృప్తిపరచు॥ 9

సూర్యచంద్రులు సాక్షులై చూచుచుండ,
మేలుకొల్పుచు చలి గాలి మేను నిమర,
ప్రమథగణములు పక్షులై పలుకుచుండ
తా " నమశ్శివాయ" యనుచు, కనులు తెరచు ॥ 10

ఒక ప్రశాంత సంధ్యాసమయోదయమున,
నిండు చూలాలగు, " మరమ్మణ్ణి " పతితోడ
వచ్చి గురుని సందర్శింప, భక్తి మెరయ,
తలుపు చాటున నిల్చె, నాయలికిడి విని ॥ 11

గురుడు, పంచాక్షరీ మంత్ర నిరతి నిలువ,
దంపతుల జూచి, వెండియు ధ్యాన నిష్ఠ
డగుచు, నా జంట భావిభాగ్యంబునెఱిగె,
వారుకేల్మోడ్చి సన్నిధిన్ ప్రణుతి సేయ ॥ 12

కరుణతో కనుల్ విప్పి, మేఘస్వనాన
ధీర గంభీరవాక్కుల తేట పడగ,
ఓ మహాపతివ్రత ! నీవు నుర్వికెల్ల
కాంతి నిడు మహా మహితాత్మగాంచగలవు ॥ 13

ఆతడైదేండ్లు నీ యింట నాడుకొనును
మరల యీ వీర పీఠంబు దరికి వచ్చు,
కాన కడుకూర్మి అతి మమకారమతని
పై వహింప తగదటంచు, పలికె గురుడు ॥ 14

అతని పల్కుల నాలించి, యతివ యెడద,
సుడ్ర గాలికి చిక్కిన సుమము కాగ,
పతి హృదయము పొంగని బడబాగ్నియయ్యె
భక్తి సౌజన్యముల్ కండ్ల పాదుకొనగ ॥ 15

అశ్రుకణములా సతికంటనలముచుండ,
భక్తి వైరాగ్యమూర్తి యై పతివచించె,
దేవ ! వుట్టెడి శిశువుకైదేండ్లు నిండ
ఆనతిచ్చిన రీతి, మీ కప్పగింతు ॥ 16

అని నమస్కరించి, గురుని అనుమతి గొని,
సంభ్రమాశ్చర్య వేదనా స్వాంతులగుచు,
ఇంటి కరుదెంచుచుండ, నా యిరువురికిని
దారిపోకడ లేవియో తట్టవయ్యె ॥ 17

భార్య కంట నలము బాష్పంబులంజాచి,
తేరుకొనగ భర్త దెలిపె, పిచ్చి
దాన ! వగవ నేల ? ధర్మ సింహాసనా
ధ్యక్షు సుతుని, చూడ తగదె, మనము ॥ 18

ఇంతకు, శివుడొసంగిన యీ శిశువును,
మనము మన యింట బంధింప మనతరంబె ?
పట్టద శ్రీ మహా శివ ప్రభుని మాట,
దాట నగునే, మహాదేవ దాసుల కిల ? || 19

కాన జరుగబోయెడి కార్యగతి, సమస్త
మా మహా శివరాత్రీశుడానతిచ్చె,
అతడు సర్వజ్ఞు డాత్మకల్యాణ మూర్తి,
ఆర్ద్ర హృదయుడా ఋషియె, లక్ష్యంబుమనకు || 20

సంతసింపతగిన సమయంబు, దారము
విరుల సేరి తలను పరిమళించు,
మనకు గురునితోడమన్నన కల్గునం
చు, సతి నూరడిలగజూచె, పతియు || 21

త్యాగమే లేక, లేరు మాతా పితలిల,
త్యాగమే లేక విశ్వమే స్తబ్ధమగును
సృష్టి సంస్థితిలయులకు జీవమైన
త్యాగమే బాధలన్ ఫల ప్రదము గూర్చు || 22

పడతి సత్వతమోరజః ప్రభలు కలసి
స్త్రీ యగును, స్త్రీయు త్యాగ ప్రకృతికి పూర్ణ
రూపు, పూర్ణత్వమే మాతృ రూపిణియయి
ఎల్లరకు నెల్ల వేళల హితము గూర్చు || 23

ఈ తత్త్వ మెఱుగ వెత యీ
రీతిగ సౌఖ్యంబు గూర్చు, పృథ్వీ స్థలిపై
పూత చరిత్రులు, శరణపు
రాతనులత్యాగ మెరిగి బ్రతుక తగుననెన్ || 24

మింటినెల్ల వెల్గించెడు మిణుకు, జలధి
గర్భమున వెల్గు రత్న ప్రకాశ, మవని
కొమ్మల పరిమళించెడి కుట్మలరుచి,
మట్టి బుట్టిన మహిమలన్ మనుజుడయ్యె ॥

# కారణ శిశువు

కపిలా స్నానము తప్పదు,
విపులంబగు నింటి పనుల వేసర పడ, దా
త్మపతి న్మరువదు, విధినె
ల్ల పుడున్ దీర్చు సతి యీశ్వరార్పణబుద్ధిన్ ॥ 1

కన్న కాళయ్య బిళ్ళయ్య యన్న సుతుల,
శివుని జోలకు నర్పించు తిర మనస్క
శంకరవ్వ పూర్ణ త్యాగ సాహసముల
నెమ్మనంబున, ఆసాధ్వి నెమరు వేయ ॥ 2

నెలలు నిండుచుండ నెలత పట్టదశివ
రాత్రిగురుడు మతికిరాన్, బెదరుచు,
భక్తుల చరితంబు రక్తి నాలించి, కం
సాలి పదముల, శివలీల లెరుగు ॥ 3

మఱ్ఱి వృక్షంబునీడ, పద్మాసనమున,
నిశ్చల మతి నిల్చెడి తపోనిధిని చుట్టి
పూల పూజించు కరుల గుంపు కనులార
మాటి మాటికి స్వప్నాన మగువ గాంచె ॥ 4

నిర్మలంబగు కోనేటి నీట నీదు
లాడుచు, విరుల సేకొంచు, నంబరమణి
నెరగి, కొండపై తా, నిల్చు దృశ్యమొకటి,
దినదినము, కల గాంచె సతీమతల్లి ॥ 5

భస్మరు ద్రాక్ష ధారులౌ భక్తవరుల,
కన్న దానంబు సేయగ, తన్ను మెచ్చి
మునిసుపత్నులు తనకు తాంబూల ఫలము
లిచ్చు కలగాంచె యా సాధ్వి హృదయ మలర॥ 6

అది జగద్విల యానలం బార్ప నేర్చు
విమల నల నామ సంవత్సర మరయంగ
భాద్ర పదశుద్ధ పాడ్యమి, భౌమ వాస
రంబున, కుమారుడుదయించె, ప్రభలు గ్రక్క ॥ 7

వెడద కన్నులు, గుంగురు వెంట్రుకల్, మ
హొజ్జ్వల ప్రభావాంగుని, ఉదిత సుతుని
కన్నులారగ జూచుచు, కడు ప్రయాస
తెలియ దయ్యె, న వ్వేళ సాధ్వీమ తల్లి॥ 8

గురుని వాక్యంబు, సత్యమై కుదిరె నంచు,
ఇంటి వారెల్ల నాహ్లాద హృదయులైరి
ఊరివారెల్ల, భక్తి సంయుక్తులగుచు,
చూడవచ్చిరి, భావికిశోర గురుని॥ 9

నాయనమ్మ బసమ్మ, నా, నామ మొప్పు,
అవ్వ వచ్చి పాపని జూచి, ఆత్మ మెచ్చె
తల్లి తల్లి యౌ మల్లమ్మ, తనయ గన్న
గడియ, గ్రహముల చూచి, చక్రంబు వ్రాసె॥ 10

ఇంతలో బసవ్వయేతెంచి, శిశు భవి
ష్యత్తు నాత్మ మెరయ, జాతకగ్ర
హాను గుణ ఫలంబులన్నియు దెల్ప, మ
ల్లవ్వ చకితయై, బసవ్వనర్థసి ॥ 11

అత్తిగే నీకు, సతత పంచాక్షరీజ
ప ప్రభావంబునన్, జగ ద్వ్యాప్తమైన
సర్వ మెరిగెడి శక్తి సంజనితమయ్యె
మాకు కల్గునే ? పుస్తకమ్మన్యులకనె ॥ 12

భక్తి వాత్సల్యమయ్యె నో! వత్సలత్వ
మరయభక్తిగా మారెనో! ఎఱుకవడదు
కాకరెంటికి మూల మొక్కటియొ, లేక
ఒకటి రెండుగా మారెనో ! యోగికెఱుక ॥ 13

యోగమే పరిపూర్ణమై, రాగమగుసె !
రాగమే జగద్భ్రమదమై, త్యాగమగుసె !
త్యాగమే జీవుల సహజ ధర్మమగుసె !
అనుభవజ్ఞానులీ గొడవలకంటుకొనరు ॥ 14

చేత శూలంబు కలదంచు, చిన్ని శిశువు
పిడికిలి బిగించె, రక్షింప విశ్వమెల్ల,
చిచ్చర కను, మూసి నటుల చిన్ని పాప
కనుల గట్టె, పుర ప్రజల్ గాంచుచుండ ॥ 15

మెరుపు రీతి, యీ శుభ వార్త గురుని చేరె,
సంభ్రమానంద గుణముల స్వామి పైకి
చూపడేగాని, గ్రహముల చూచి ఉత్త
రాధి కారి ప్రభావంబు, నాత్మతూచె ॥ 16

జన్మ కాల చక్రంబున, చంద్రుడున్న
రాశి, జన్మలగ్నంబును, గ్రహముల స్థి
తి గతి, షట్బలంబుల ప్రగతి పరికించి,
జాతకుడు జగద్గురుడంచు సంతసించె ॥ 17

కారణ శిశుహంస, గర్భస్థమై యుండి,
శరణు సేవలందు, సాధుమూర్తి,
రాజమౌళిగాన, రాజేంద్రగురుడంచు,
పేరు పెట్టె గురుడు, ప్రీతి తోడ ॥ 18

4

పుడమినాదంచు దొగ్గాడు, ముందు ముందు,
గంగనాదంచు నీ రాట గంతువైచు,
గాలివెల్తురు నాదంచు, కేలుసాచు,
అంబరంబు నాదేయని అఱ్రునెత్తు ॥ 19

మేను పాలార బోసిన మిసిమి పసిమి,
కనుల చిరునవ్వు దొనకు యోగానుభూతి,
పలుకు తేనె లొలుకు రస గుళికులౌర !
రెండునిండని పాపలో పండె ప్రీతి ॥ 20

ఇంటి వారెగాక, యెవరు పిల్చిన పోవు,
ఎదుట బడిన బూది నదుము కెంచు
పలికినన్ నమచ్ఛివా! యను నౌర ! సం
స్కారమెంత బలమొ సహజమంత ॥ 21

తల్లి పాల్చువ్వతిని పింప దరికిరాగ,
వలదు వలదంచు దవ్వుల పరువుదీయు
ఇష్టలింగ ప్రసాదంబు నిదియనంగ,
పరుగు పరుగున దరిచేరి బాచుకొనును ॥ 22

అంబచేసెడి యిష్టలింగార్చనంబు,
దిన దినంబును చూచు తదేక దృష్టి
జోలనూపుచు శరణగీతాలు పాడ,
కన్నులరమోడ్చిఆభావగతినిమలగు ॥ 23

నొసటి భస్మరేఖలు, మెడనృసిడిపోగు
లలరు రుద్రాక్షమాలయు, నందరి యెద
లాత్మ జేర్చుతొక్కు పలుకు, లలర చేయ,
మూడు నిండని పాపడు ముద్దుగొలిపె ॥ 24

చూపులచురుకు, పలుకులుతీపి, పెదవి
సంజ, చిరునవ్వు మెరయగ స్వాంత మందు
మధుర భావంబులూరించి మరులు గొలుప,
నాల్గు నిండని బాలుడానందుడయ్యె ॥ 25

అవ్వ తత్త్వార్థ సాధనంబైన గాథ,
లల్లి, విన్పింప, పిన్న వాడాలకించు,
ఒక కిరీటంబు, పెట్టెయందొప్పుచుండె,
దాని కనువగు తాళబంధంబుగలదు ॥ 26

ఒక్కనాడు మూటికి, స్పర్ధయుదయమయ్యె,
రత్న మకుటంబు మిగుల గర్వంబు తోడ,
నన్ను మించిన వారలీ నాడులోనె
లేరు, నే నృపు శిరసు వెల్గింతుననగ ॥ 27

మందహాసంబు పకపకమంచును పరి
హాసమున్ చేసి, చాలు నీ హంగు, నాకు
తెలియదే ? నేనలేక, పదిలత నీకు
గలుగునే ? యన తాళంబు కంగుమంచు ॥ 28

ఏ టి మాటలు మీవి, మీ రింత దాక
ముఖ్యమగుమూల శక్తినే, ముట్టుకొనరు,
ఏ నలేక మీ యిర్వురి కేటి రక్ష ?
బయలు బిగిసేయు నేర్పు, నా బలమనంగ ॥ 29

అయ్యగారె చెప్పవలె, కథాంతరమగు
సత్యమేదియో ? యన, చిట్టి సామి పలికె,
పైడి, కొయ్య, ఇనుము, పైకి చూడ వేరె
కాని వీటి యన్నింటిలక్ష్యాంశమొకటె ॥ 30

వివిధ కార్యముల్ దీర్ప, వేర్వేరు గుణము
లంది, వేర్వేరు రూపంబు లవతరించు,
అన్నిటికి శక్తియే మూల, మది, శివమయ
మెరుగ, హెచ్చు తగ్గుల భేదమిందు లేదు ‖ 31

మకుటము శివమయము మనజేశు గావ, మం
జూషిక శివమయము సొమ్ము గావ,
బీగము శివమయము పెట్టెను గావ, ర
క్షించు శక్తి యొకటె శివమయంబు ‖ 32

అన్నియు శివాత్మ కంబుగ
మన్నన వెలుగొందుగాన, మర్మజ్ఞులు ఈ
భిన్నంబగు రూపంబుల
కన్నుల భ్రమ, యంచు తెలియ కల్గుదురెపుడున్ ‖ 33

గుణముల కనువగురూపము,
అనునయ కార్యముల దీర్చుటది దాసోహం
బున, సర్వ మీశ్వరార్పణ
మొనర్చు రసికుడు, గుణంబులుడిగి మృడుడగున్ ‖ 34

బాలునియీవివరంబుల
నాలించిన, యింటివారలౌరా ! యనుచున్,
వ్రేలును ముక్కున చేర్చుచు,
పాలించునితండు, జగతి భావిగురుండై ‖ 35

జగతినెల్ల నాకర్షించు చక్కదనము,
జనుల మంత్రముగ్ధులచేయు సరసపు నుడి,
హృదయమలరించు చేతలైదేండ్లనిండ
బాలునిదలంచి, తలచె, గ్నుర్వాజ్ఞ తండ్రి ‖ 36

జననీ జనకులు త్యాగం
బునకున్ ప్రతిరూపులైరి, పూర్ణ త్యాగం
బున యీ చరాచరజగం
బె నిలచె, నిది తెలియ, మృత్యుభీతి యడంగున్॥

# మాతృహృదయము

బాలగురునికి ఐదేండ్లు వయసునిండ,
తలకు నీరోసి, పట్టు బట్టలు ధరింప
చేసి, నొసలిపై భస్మంబు బూసి, అరుత
నిష్టలింగము రుద్రాక్షలిచ్చు నిలుప || 1

బాలుడు కుమారగురునిగా ప్రభలు జిమ్మ
తండ్రి మల్లయ్య ప్రేమతో దనయు జూచి,
అయ్యగారికముందు, విద్యలగల పర
మార్థ మరయ, మఠంబున కరుగవలయు || 2

అంచు తాళమేళముల మ్రోయించుకొంచు
బంధు జనములు వెన్నంటి ముందు నడువ,
భావిగురునితో మల్లయ్య వచ్చి, మఠము
సొచ్చె శివరాత్రి గురుడాత్మ మెచ్చుచుండ || 3

తలనిండ మృదు కుటిలకుం
తలముల్, వదనమమృతాంశు తలపించుకళల్,
వెలుగులు చల్లువిశాలా
క్షుల కని, ప్రజమెచ్చ, గురు కిశోరార్భకునిన్ || 4

బాలుడేతెంచి, గురువరు పదములంట,
పట్టద శివరాత్రీశుడు, బాహ్యజగతి
గ్రమ్మ సంధ్యారుణ ప్రభల్ గాంచడయ్యె,
బాలుని కనీనికల్ తన్ను బంది సేయ || 5

స్వామి కైలాస నాధుని, సన్నికర్ష
ణ ప్రభా దివ్య తేజంబునన్, మఠంబు
పొంగ, శాంతి సౌహార్దముప్పొంగ, కనులు
వెడదలై శివ యోగమున్ విశదపరచె|| 6

క్షణములో మేల్కొని, కనుల గాంతి దొరల,
బాలుని శిరాన ఆనంద బాష్ప పుష్ప
ములు గురిసె దేహ మందెల్ల పులకలెగయ
శివ గురుడు, భావి గురువరు జేరదీసె ॥ 7

చిరుత వాని కన్నులరవింద పుష్పంబు
లై శివ గురుకన్నుల న్గొలువగ
పట్టదగురువరుని, పంచాక్షరీ తప
స్సిద్ధులా కుమారుజేరిపోయె ॥ 8

నిజబలంబుడిగినటుల, నిలువక, శివ
రాత్రి గురుడు కూర్చొనగ, అర్భకగురుండు
నిష్ఠతో లేచి, కేల్మోడ్చి, నిలిచె చెంత,
అంత గురుమూర్తి హృదయంబుహాయి తేలె ॥ 9

చెంత గల, పరిచారికాశిష్య తతిని
చూచి, నల్పుడో త్రివిధదాసోహ, మిది శు
భ దినమని, పట్టద గురుండు బలుక, జరిగె
ఇష్టమృష్టాన్న దానంబు లెల్లరకును ॥ 10

చూడవచ్చిన జనమెల్ల చోద్యమంది,
చిన్న వాడేడ, పట్టద శివ గురుండు
ఏడ ? ఒక్క రొక్కరి ముఖంబెరుగరౌర !
వీరి గురు శిష్యబంధమేవింతగూర్చె ॥ 11

జన్మ జన్మల వచ్చు సంస్కార శక్తి,
తాము తరియించి, తరియింప తమ జగత్తు,
గురుడు శిష్యుడై శిష్యుడే గురుడగునను
ప్రాజ్ఞులపుడు, సత్యమై పరిణమించె ॥ 12

అటు సతీసమేతుడై నిల్చు మల్లయ్య
వంక జూచి గురుడు బలికె, బాస
దప్పనట్టి పుణ్యదంపతుల్ మీరు, మీ
జన్మ యెల్ల విధుల సార్థకమవ॥ 13

తల్లి శంకరమ్మ, ఉల్ల మందూరు మా
తృత్వమొక శిలాకృతిన్ ఘనీభ
వించి, చెప్పరాని వెతల బాధింప, గు
రుని పలుకులనది మరుగుచు కరిగె॥ 14

కనుల జొటజొటమని, గ్రమ్మగ న శ్రువుల్,
పెగలకుండ నుడులు, వెక్కి వెక్కి
సుతుని జూచి యేడ్వ, సుతుడాక్షణంబున,
తల్లి ముఖము సూచి తల్ల డిల్లె॥ 15

గురుడు కరుణార్ద్ర దృశ్యంబు నరసి, పలికె,
చూడు మో తల్లి నీ వెత చూడలేక,
లే హృదయ మెంత తల్లడిల్లెనొ యితండు
కోటి కోటి తల్లుల వెతల్, కూల్ప గలడు ॥ 16

ఆత్మ గురుని కంబవౌ నీవ, యిటులైన,
జగతి దుఃఖమింక చల్లబడునె ?
ఆకులలముల దిని, అల్లాడు జనులకు
పట్టెడన్న మితడు, పెట్టవలదె ?॥ 17

ఊతకర్రగనడపించు నొక్కసుతుని
కాలపురుషుడు గొనిపోవ గద్దవోలె,
బాధపడుచున్న వృద్ధదంపతులకితడు
పట్టుకొమ్మగ శివుడౌచు, బ్రతుకవలదె ? ॥ 18

అజ్ఞానంబున బడి, ప్రజ
జిజ్ఞాసాపథము తప్పి, చిక్కుల బడ, స
ర్వ జ్ఞుని దివ్యాంశంబిట
విజ్ఞతసుతుడయ్యె, వేదనతగునే ?|| 19

ఇంతకు నీ సుతుడిట, దీ
మంతుండై పెరుగు, చింతమానుము, క్షేమో
దంత మరయ, రావచ్చును
శాంతినిలయ మెల్లరకిది, స్వాగతమిచ్చున్ || 20

అనమానిని చిత్తము, నిం
డిన పూర్వ గ్రహాభయంబు డీల్పడ, సామా
న్య ను గురుదేవా ! రాజ
య్యను విడలేకిట్టులైతి, అన్యమెరుంగన్ || 21

ఈ యయ్య మాకు సర్వం
బీ యెడ, మీ చేత బెట్టి, యేగెద మిటపై
మీ యిచ్చు అయ్య భాగ్యము,
మా యజ్ఞతసైచి, మమ్ము మన్నింపవలెన్ || 22

అని శివరాత్రీశు గురుచ
రణాబ్జములకెఱగి, లేచి, రాజేంద్రుని మో
మును తిరిగి, తిరిగి, చూచుచు,
తనయింటి ముఖంబు పట్టె, తల్లియు పతితోన్ || 23



విరికి తావికినిగల చుట్టరికమెంత ?
తల్లి బిడ్డలకున్న బాంధవ్యమెంత ?
ప్రకృతికి పరమాత్మకుగల బంధమెంత ?
తెలియవలె గాదె మోక్షమున్ తలచువాడు ॥

# తత్త్వజిజ్ఞాస

పట్టదగురుని దినచర్య పట్టుబడగ,
మఠమునన్, భావి గురుడు క్రమ, క్రమముగ,
సంధ్య మేల్కొని, శివ గణ స్మరణతోడ,
ఇష్టలింగార్చనా సక్తి హృదయముబుక ॥ 1

అభవు నైశ్వర్య మందున్న హాయిదలచి,
తనువు సంధ్యారుణజలాల తంపుగొనియె,
మంద మందానిలంబుల మనసుదేల,
ప్రకృతి సౌందర్య మందాత్మ పరివశించె॥ 2

ఒక శుభోదయ సంధ్యా ముహూర్తమందు,
స్నాన మొనరించి, లింగార్చనా పరుడయి,
ముందు నడచెడి గురునితో ముందుకురికె,
వెనుక వచ్చెడి బాలగురుని మనంబు ॥ 3

వచ్చి గురుశిష్యులిద్దరు భక్తి మెరయ
పూర్వ గురుసమాధుల కెల్ల పూజ సేసి,
నిశ్చల ధ్యాన యోగాననిలువ గురుడు,
ఇష్టలింగాన రాజేంద్రదృశ్యమరసె॥ 4

ఆ సమాధి పుష్పంబులత్యద్భుతముగ
గాలిలో రేగి, వారి శీర్షాల వ్రాలె,
ఆత్మ నలము గురు పరంపరాగతమగు
అతుల శక్తి, రాజేంద్రునందైక్యమయ్యె ॥ 5

అంత ప్రకృతి బంధంబులే, యంతమంద,
మృదుకుటిల శిరోరుహాము ల దృశ్యమయ్యె,
జిలుగు బట్టలు కావిబట్టలగ మారె,
భస్మరుద్రాక్షలురముపై, ప్రభలుగ్రక్కె ॥ 6

ప్రభవనామ సంవత్సర ఫాల్గుణ సిత
తదియ భృగువాసరంబున, తక్కిన గురు
శరణులున్ గొల్వ రాజేంద్ర సద్గురుండు,
వీర పీఠంబు నెక్కె సుత్తూరుమెచ్చ॥ 7

రత్న ఖచితకిరీటంబు రాజిలంగ,
రమ్య వల్కల ధారియై, రాజగురుడు,
పదియురెండేండ్లు నిండని ప్రాయమందు,
పీఠమేకాదు, ప్రజల హృత్పీఠ మెక్కె॥ 8

పరమ మాహేశ్వరాగమ ప్రగతిచూడ,
భక్తుల పురాతన చరిత్ర పాట బాడ,
తహతహపడు రాజేంద్రుని తపన తెలిసి
పట్టద శివరాత్రి గురుడు ప్రమదమందె ॥ 9

బాలగురునితో, శివగురుప్రభుడు నొక్క
దినము, మాహిష్మ తీపురంబునకు వచ్చి,
అట నమశ్శివాయ మఠమహా ప్రభుడగు
సోమశేఖర స్వామిని చూచె, భక్తి॥ 10

అతుల నైష్ఠిక బ్రహ్మచర్యాశ్రమమున,
పృథుల సంస్కృత విద్యా పరిశ్రమమున,
నేర్పుగల మీరు విశ్వసనీయులంచు,
చెంత చేరిన చిరుత రాజేంద్రుజూపి ॥ 11

ప్రథిత సుత్తూరు పీఠాధి పతి యితండు,
ఇతని కనువగు విద్య నేర్పింపవలెను,
కాన తగిన విద్యా గురున్ కరుణచూపి
మార్గదర్శన మొనరించి మనుపుడితని ॥ 12

పిన్న వాని కెల్ల విధముల, మీరె, తో
డ్పడ వలె, సుర భాష పట్టువడగ
నిఖిల ఆగమముల నిష్ణాతుడై, సదా
చార విధుల నితడు సాగుననగ ॥ 13

వినయ వినమిత గాత్రుడై పిన్నవాఁడు
దరిసి మ్రొక్క బోవగ జగద్గురుడ వీవు
నీకులోకమే కేల్మోడ్చు నీవయిటుల
శిరమువంచరాదని సోమ గురుడుబలికె ॥ 14

కొట్టవచ్చుతేజస్సు కన్గొనలచిందె,
పల్వరుసనా సరస్వతీ ప్రభలు మెరసె,
వెడదయురమున శివశక్తి విస్తరించె
బాలుడయ్యు నీతడు పూజ్య పాదుడరయ ॥ 15

వాసుకి కిరవౌ వల్మీకమీసుతుండు,
చెప్పలేము, కాని ముఖంబు చెప్పుచుండె
జగతినే వశంబొనరించు, శక్తి యేదొ,
కారణ పురుషుడీతడు కాగలడటంచు॥ 16

భవ రోగవైద్యవరుడున్,
ప్రవిమల పంచాక్షరీ జప పరాయణుడున్,
అవిరళ తేజో నిధి, యీ
శివరాత్రి గురుని మనంబు శ్రీకరమనుచున్ ॥ 17

ఆజ్ఞాపించినరీతిగ,
ప్రజ్ఞానిధి శాస్త్రి బసవరాజాఖ్యుండున్
సుజ్ఞాన మూర్తియే, ది
వ్యజ్ఞాన ప్రదుడగు, మనవర్చస్వికినాన్ ॥ 18

అక్షయ సంస్కృత విద్యా
దక్షుడు బసవాఖ్యగురుడు తరియని పీఠా
ధ్యక్షుల దర్శించుటకై
తక్షణమేతెంచి గురుపదంబులమ్రొక్కెన్॥ 19

ఔర! వెదకబోయిన తీగ అంఘ్రిపదము
చుట్టినట్లయ్యె, తలచిన సూరియె, యెదు
రయ్యె, పరమేశ్వరానుగ్రహంబిది, యని,
పట్టదగురుడు సముదిత స్వాంతుడయ్యె॥ 20

శివమస్తని గురువరులు బ
సవయ్య కాశీస్సులిచ్చి సముచిత రీతిన్
వివరించిరి విద్యాభ్యా
స విషయమా బాల గురుని చదువరిసేయన్॥ 21

నాకు ను మహా ప్రసాదం
బీకింకరుడెరిగినంత, హితమిత వచనో
త్సేకంబుల వివరించెద
శ్రీకరషట్ స్థలములంచు, శిరమట వంచెన్॥ 22

సోమశేఖరుడాతనిచూచి పలికె,
వివిధ శాస్త్రాగమరహస్యవిదుడు, బసవ
గురుడు, వరశివాచారతత్పరుడితండు,
నెంతవినయ నిధియొ, విద్యనంతఘనుడు॥ 23

అన, శివగురుడు ప్రీతితో, నమల పుష్ప
ఫలసుగంధ తాంబూలముల్, పట్టుబట్ట
లొసగి, వినమిత గాత్రుడౌ బసవ పండి
త గురుపరు గౌరవించె, నాతండు నంత॥ 24

పలికె గురుదేవ! ఇది పరాత్పర వర ప్ర
సాద, మనుపమం, బిది గురు స్థాన గౌర
వముల నెరవెట్టి, చూపు, శుభాభ్యుదయము,
శుభ ముహూర్తాన శిక్షకు జొత్తుమనగ॥ 25

ప్రభు గురుండు రామానుజరస్తయందు,
వాసయోగ్యమౌగేహంబుసేసి, తోడ్ప
డ, శివ రాత్ర్యప్ప, వండి బెట్టగ తగుజన
మటకు బిల్పించె, బాలుని కండగాగ॥ 26

పిన్నవాని అధ్యయనంబు కన్ని విధుల,
సహకరింపుడుమన శివాచార నిత్య
కృత్యములకు భంగంబు గాకెల్ల గతుల,
నితని, కనుల కనులిడి, రక్షింపవలయు॥ 27

తలచినంతనే వ్రాలె దీ స్థలి కటంచు,
పయనమయ్యె సుత్తూరికి పట్టదగురు,
డంత, శివరాత్రి రాజేంద్రుడాదిగ శర
ణాళి మ్రొక్కి, గురునకు వీడ్కోలు నిచ్చె॥ 28

బసవ రాజయ్య, రాజేంద్ర బాలగురుని
కి, సుర భాషతో పాటు శాస్త్రసమయాది
తత్త్వదర్శన సారమాద్యంతమెరుక
పరచె, చాత్రుడాలించిసర్వంబు నెరుగ॥ 29

స్థలము, లింగములన, పరతత్త్వవాచి
శైవులకు పరశివుడు, వైష్ణవులకిదియ
తలప, నారాయణుండు, స్మార్తమతమందు
బ్రహ్మమై ఉపాసకుల తత్త్వార్థమయ్యె॥ 30

పరశివస్పందనమ్మున, ప్రభవమయ్యె
శివుడు, శక్తి, సదాశివ శ్రేణి తోడ
ఈశ్వరుడు, శుద్ధవిద్యయీయేనహంక్రి
యాభిమానతత్త్వంబులై, ఆవరింప ॥ 31

స్థలమొకటి యిట, లింగాంగజంటయగుచు,
సేవ్య సేవకభావముల్ చెలగుచుండ,
స్థలగతాంతరమౌ శక్తి, కళగ, భక్తి
గ, ద్వివిధాభూతమై శివాంగముల జేరె ॥ 32

శక్తియుక్తుడై స్థావర జంగమాత్మ
క ప్రపంచమున్, సృజియింప కలిగె, శివుడు
భక్తి యుక్తుడై, అంగుడీ ప్రకృతి బంధ
మడగ, మరల పరశివాత్మ నైక్యమందు ॥ 33

మాయచే, భేద బుద్ధిని మరగు శక్తి
ప్రకృతి యగు, ప్రకృతిన్ గుణ త్రయముపుట్టె
అదియు నిరువది నాల్గు తత్త్వాత్మక ప్ర
పంచమగు, తుదిన్‌పురుషుండు ప్రభవమయ్యె॥ 34

మాయ యగు శక్తి, సృష్టి సమయమున కళ,
కాల, నియతి, అవిద్య రాగంబులీ శి
వాంశ పురుషునిన్ గవియుచు, ప్రకృతియయ్యె
భోగ బద్ధుడై భవియయ్యె పురుషుడంత ॥ 35

పురుషునీయ విద్య ముట్టగ అల్పజ్ఞు
డయ్యె, కళకు చిక్క అల్పకర్తృ
వయ్యె, రాగమువిషయ్యాసక్తునింజేసె
కాలనియతి బద్ధకర్ముడయ్యె ॥ 36

అంత ప్రకృతిబద్ధాత్ముడై అడలు భవియు,
అంగుడై, శివాభిముఖంబునంద, శివుడు
తన తిరోధాన శక్తిని అడచ, వాని
నంటిన మలాంశ భోగంబు లడగతొడగె॥ 37

జననమరణాల చర్విత చర్వణుడయి,
బాధ పడుచున్న భవినికాపాడనెంచి,
శక్తి, భక్తియై వానిని జననిరీతి
శివుని కడకెత్తుకొని పోవు, చిట్టచివర॥ 38

ఈశ్వరానుగ్రహ ప్రాప్తియేర్పడంగ,
హరుడు గురుడౌచు, దీక్షాత్రయంబుతో నొ
సంగ, లింగత్రయమును, నిస్సంగుడంగు
డంత,షట్ స్థలో న్నత భక్తినందు కొనును॥ 39

ఇరువది నాలుగు తత్త్వపు
టురులుడుగగ, ప్రకృతి బంధముడుగున్, కానీ
పరిపూర్ణ ముక్తి నందగ,
హరింపవలె, పదియు రెండు నడ్డంకులిటన్॥ 40

ఆణవమలమడగగ, వే
ధానయ దీక్ష నహమణగి, తా నవ్యక్తా
ధీనమగు భావలింగము
చే, నిలపరిపూర్ణుడనుచు, శిష్యుడెరుంగున్॥ 41

మాయామలమడగగ, గురు
డాయతుడై మంత్ర దీక్ష నందింప, మనః
శ్రేయముగ ప్రాణలింగం
బీయెడ, సర్వజ్ఞు జేయు నాత్మచ్ఛాత్రున్॥ 42

కార్మికమలమడగ, గురుడు
కూర్మి క్రియాదీక్షనిచ్చు, కొను శిష్యుండున్
పేర్మియెద, నిష్టలింగపు
ధర్మంబున, సర్వకర్త, తా, నని తెలియున్ ॥ 43

మాయాకార్మికమలములు
మాయంబొనరింప, నూర్ధ్వస్థితిచే
పాయున్భేదజ్ఞానము,
నీ యాణవమ్మల మడంగ, నింకునహంబున్ ॥ 44

గర్వగ్రంధినశింపగ,
సర్వజ్ఞుడు, సర్వకర్త, సంపూర్ణుండై,
ఉర్విన్పరశివుడై, తా
పర్వున్భక్తుడు, సమరసభాగ్యుండగుచున్ ॥ 45

ఈ చరాచరాత్మక జగంబెల్ల నెరుక
పరచు, సర్వజ్ఞనరచేత, గురుడు నిలుప,
ఇష్టలింగమై జ్వలియించు నిచ్చునంగు
డ హరహ్నాంబుపాసించి, తా, నాత్మ గలియు॥ 46

అంత దేహాభిమానంబు, నంతరింప,
జాతికుల మత స్త్రీపురుష ప్రభేద
మణగ, బీజ వృక్షన్యాయమంది భక్తు
డవని నిత్య సత్యవ్రతుండౌచు, బ్రతుకు ॥ 47

చపలమౌ ఇంద్రియముల చాంచల్యమడగ
ఒక శివోపాసనక్రియ, న గ్రమగుచు
మెరయ, సలిల ముక్త న్యాయసరణి, భక్తి
నిష్ఠ, పరమ మాహేశ్వరశ్రేష్ఠుడొప్పు ॥ 48

తాను, గురులింగ జంగమత్రయికి, వరుస
తను మనధనంబులర్పించి, త్యాగియగును.
అన్య దైవపరాఙ్ముఖుండైమదిగురి
నంట, బ్రహ్మాది పదవుల కంటుకొనడు|| 49

చిత్తము స్థిరమయి, శివయోగిగాన్, సర్వ
మీ శ్వర ప్రసాదమే యటంచు,
అన్నిటమలమడగ, అనలకాష్ఠన్యాయి
గ, అవధానభక్తిగను ప్రసాది || 50

స్థిరతరంబైన చిత్తాన, చిద్ఘన ప్ర
సాది, అపరోక్ష జ్ఞానియై, సకల జగతి
నమృతరూపంబుగా, నీశ్వరార్పణమతి,
ఆత్మ భోగోప భోగియైయనుభవించు || 51

లింగమై అంగు, డద్వైత సంగమంద,
శివుని సతతంబుదలచి, పూజింప, ప్రాణ
లింగి, భ్రమర కీట న్యాయ రీతి శివగు
ణంబులన్, భక్తుడనుభవానందుడగును|| 52

నిఖిలభువనసందర్శనానిపుణతయును,
సకల రూపసందర్శనా శక్తికలుగ
ప్రాణమే శివుండౌచు, సర్వంబు దీర్చ,
తా, సదా మంత్ర జపమున తగిలి యుండు || 53

శరణుడానందభక్తిని పరశివ పతి
బాహుబంధాన నిశ్చింత, బాహ్య దేశ
కాలగతులింక, కల్యాణిగా, సుఖించు,
ఈ సతీపతి ప్రణయమే హృన్మధురము|| 54

సాగరస్థమౌనదిరీతి, సమరసమున
ఐక్యుడు శిఖికర్పూర న్యాయమున కరగి,
సర్వకర్త, సంపూర్ణుడై, సర్వ మెఱిగి,
కడకు శివునితో నొకటిగా కలసిపోవు ॥ 55

ద్వైతముతో మొదలై, అ
ద్వైతముతో పరిణమించు, దర్శనమగుటన్
ద్వైతాద్వైతంబని, ప్ర
ఖ్యాతింగనె, దార్శనికులయనుభవదృష్టిన్॥ 56

శక్తిలో బుట్టుభక్తియే, జననియగుచు
కడకు పరశివున్ చేరెడి కారణమున,
ధాత్రి శక్తి విశిష్ట అద్వైతమగుచు
తల్లి బిడ్డల బాంధవ్య తత్త్వమయ్యె ॥ 57

వాచామ గోచరమగు,
ప్రాచీనుల అనుభవంబు, వైయక్తికమై
ఆచరణంబున లభ్యం
బౌ, చెప్పితిదోచినంత పాటింపదగున్॥ 58

పదియు నాల్గేండ్ల రాజేంద్ర బాలుడిటుల,
అధ్యయనమొనరించి, శాస్త్రాగమార్థ
సారమున్ గ్రోలె, కాని తా స్వానుభవము
గోరి, సోమ శేఖరు గురుచేరుచుండె ॥ 59

గురుడు వాత్సల్య దృష్టి వాక్రుచ్చిన, నిగ
మాగ మోక్తుల వ్యాఖ్యానమర్థమయ్యె
కాని యనుభవ జ్ఞానంబు కలుగదౌర!
చిల్క పల్కులై గాలికి చెదరుచుండె ॥ 60

అభిద లక్షణ వ్యంజనంబనుసరించి,
సంస్కృత గ్రంథరాశిలో సారమేమొ
తెలియవచ్చె యీ పాండితీ బలము చేత
శివుని చూచెడి ఆశనశించె, నాకు॥ 61

బలిమి ఉచ్ఛ్వాసనిశ్వాసములబిగించి,
సిద్ధులంబొంద, గలిగిన స్థిరత గలదె ?
ఈ జగత్సృష్టికిన్ మూలమేది ? జీవు
లేటికిట భవ బంధముల్ కృంగుచుంట ॥ 62

గడియ గడియకు మారు జగంబునందు,
స్థిరత చూచుట నెట్టులో తెలియనైతి,
సృష్టికిని, జీవకోటికి, శివునికి, గల
అంతరాంతర మణగార్చు టరయకుంటి ॥ 63

సత్యమెట్టిదో, చూపెడి చదువులేదె ?
చిత్సుఖంబంద ఁచేసెడి, సీమ యేదొ ?
ఆత్మ కానందమందించు, ననుభవంబు
లేదె ? యీ సృష్టి సౌందర్యలీల యెటులొ ॥ 64

విరికితావికిని గల చుట్టరికమెంత ?
తల్లి బిడ్డల కున్న బాంధవ్యమెంత ?
దేహి దేహంబులందున్న తీపియెంత ?
తెలిసి తెలిపెడి వారల తెలియుటెటులొ! ॥ 65

ఏది చూచినా దుఃఖమే, ఎవని చూచి
నా నిరాశయే, యెటు చూచినా తమసమె,
తగుల, యిక సత్య సౌందర్య శివములనుట
కవులనుడులయ్యె, కలగన్న గంటనంగ॥ 66

సోమగురుడా పలుకులకు, చోద్యమంది,
బాల గురుని ప్రశ్నాళికి బదులులేక,
ఈ విశాల నేత్రజ్యోతు లీశ్వరాంశ
మరయ, తహతహ పడుచుండె ననుచు తలచె ॥ 67

ఔర ! ఇతడు జగద్గురుండౌట, నిజము,
ఇతని తపనలో సత్యాత్మ కుతకుతపడె,
కడలి కలచిన రత్నాలు పడయుటరుదె ?
అంచు నాతని దరిజేరి ఆదరమున ॥ 68

సత్యమేదియో చూపెడి స్వామి గలడు,
సృష్టితత్త్వంబు నెరిగించు స్రష్ట గలడు,
అనుభవంబంది, అందించు నభవుడుండె,
కాంచ దగునయ్యనాతని కాశిలోన॥ 69

అనెడి వేళకు సరిగ, ఆహ్వాన మొకటి
వచ్చె సుత్తూరికతడు రావలెనటంచు,
వెంటనే తన వారితో నింటి నుండి
పయనమై ఆతడు గురుని పదములంటె ॥ 70



ఆకు దాచిన విరి గంధమడపతగునె ?
పికి కుమారికి పాట నేర్పింపవలెనె?
గాజు పొర గప్ప జోతికి కాంతి తగ్గ
గలదె ? పక్వ జీవికి నేర్వ కళలు గలవె ? ||

# కాశీ ప్రయాణము

బక్కచిక్కిన తనువుతో, బాలుడొప్పె
స్థిరతమెరసెడి బంగారు తీవబోలె,
భక్తి సంభ్రమంబుల పరిపక్వమైన
ఆత్మ సంస్కృతి, నడనుడుల్ వ్యక్తపరచె ॥ 1

దినదినము సూక్ష్మబుద్ధి పదునగుచుంట,
ఈ విశాలనేత్రజ్యోతులెరుక పరచె,
స్నాత కచ్ఛాత్రుల కిదియు సహజమంచు
గురుడు, కనుఱెప్పనుండి కాల్గోటి దాక ॥ 2

చూచి, నిగమాగమాదులు చూచినావె ?
సకల శాస్త్రంబులందున్న సత్యమెఱుక
వడనె ? గీర్వాణ భాషా ప్రపంచమందు
కలమహత్వంబు, తెలిసెనే ? తెలుపుమనగ॥ 3

బాలగురుడంత తలవంచి, భక్తి బలికె,
సంస్కృతంబర్ధమయ్యె, షట్ శాస్త్ర పరిధి
తెలిసె, నిగమాగమాదులనిలువెరుంగ
అనుభవజ్ఞానమందకే అందుటెటులో ? ॥ 4

అన నా బాలుని పల్కులు
వినయంబును, తత్త్వదృష్టి వివరించె, నటం
చును మెచ్చి గురుడు,శీఘ్రం
బుననే శివగురుని కరుణ పొందెద వనగాన్ ॥ 5

అవి శరన్నవరాత్రు, లాయదను జూచి,
విద్య నేర్చెడి తృష్ణ హృద్వీధి రేగ,
కాశికిన్ చేరె, బాల సన్యాసి, మఠము
వారలీబాలగురునికై పరితపింప ॥ 6

స్నానమేలేక, శివపూజ సాగదయ్యె
పూజ లేక ప్రసాదంబు, పూజ్యమయ్యె
గింగురమనె చెవుల్, మేను కృశత చిక్కె
కాని, తరుగదుత్సాహమాకన్గొలకుల ॥ 7

కాశిచేరి, గౌరీ శంకరేశగురుని
చూడనాతడు నత్యంత చోద్యమంది,
స్నాన పూజాదికంబులు సాగ, తొలుత
నతని కేర్పాటుచేసె, గృహాంతరమున ॥ 8

మూడునాళ్ళ దీర్ఘపయనంపుబడలిక అ
డంగ, రాజేంద్రుడే తెంచుసంగతిన్ గ్ర
హించి, అరవిచ్చు పెదవి లే హృదయ మంట
అల్ల నల్లన దరిజేరి అతడు పలికె ॥ 9

సోమశేఖర గురులాది సూరివరులు
మెచ్చ, విద్యల కేంద్రమై మెరయు నీ స్థ
ల ప్రభావం బనాదిగా సుప్రసిద్ధ
మయ్యెకాని, ప్రాజ్ఞుల కిది అనవసరము ॥ 10

చిరుతవయ్యను, మాకుపూజింప దగిన
ఉన్నతోన్నత స్థానమందుంటి, వీవు
ఆత్మ విద్యాబల ప్రౌఢినందు నీకు
లౌకికంబగు విద్యలు సోకవయ్యె ॥ 11

భస్మరుద్రాక్షలన్ మేను పావనముగ,
కావులన్ కల్గు, జ్ఞాన భాస్కరుడవీవు
అంధకారావృత్తంబైన యవని వెలుగ
స్ఫటికసుందర దీపమా స్వామి వీవు ॥ 12

సత్యమేదియో తెలియక, శాశ్వత పద
మంద గాక, నత్రాంతంబు నడలు చున్న
జీవ కోటిని కాపాడు శివుడవయ్య,
నీకు, నేర్పెడి విద్యలు మాకుగలవె ? || 13

తరచు కొలది అగాధమై పెరుగు చుండె,
చూచినట్లెల్ల వింతగా దోచు విద్య
ఆయువువ్యయంబగుచుండె, అంతకంత
ఆత్మ, చిక్కక మృగ తృష్ణయై కలంచు || 14

శివ శాసనమగు నొసలున్,
భువనంబుల ప్రేమదడుపు, పూర్ణాకృతియున్
దివినాకర్షించెడి మృదు
ల వచో విభవంబు దెలిపె, రాజగురుని గాన్ || 15

అనెడి వేళకు సరిగ ప్రత్యక్షమయ్యె
పట్టద శివరాత్రి గురుడా పట్టునందు
చకిత నేత్రులై యిరువురు సాగిలపడ,
చేర్చి వారల నాతడాశీర్వదించె || 16

శిరమువంచిన రాజేంద్ర శిష్యుజూచి
అయ్య !యీ యాత్రచే శుభంబయ్యె, త్రిపద
గామినిన్, జగత్పావని గంగమునిగి
విశ్వనాథుని, చూడుమీ విశ్వమందు || 17

డుంటివిఘ్నేశ్వరస్వామిఅంటమదియు,
కాలభైరవునాత్మలో గాంచి మ్రొక్కి,
వీరభద్రుని సేవించి, విశ్వనాథు
నిష్టలింగములో జూడ, తుష్టియగును || 18

సారాచార విచారము
గౌరీ శంకరబుధుండు, కరుణాన్వితుడై
ఈ రోజునలక్ష్యార్థపు
దారిని చూపించె, నడువ ధర్మంబనుచున్|| 19

తిరిగి రాగ సుత్తూరి కాయిరువురగని,
సంభ్రమాశ్చర్యనేత్రులై శరణకోటి
సంతసంబందె, పోయిన సంచి మరల
దక్కినట్లయ్యె, వారికి, దక్కె శాంతి || 20



తన్ను తాను తెలిసిన, తత్త్వజ్ఞుడా, మ
హాత్ముడున్న పదమె వారణాసి, అతని
మాట మంత్రమాతని తపోమహిమ, గురుప
రంపరన్ సచ్చితానంద రాజ్యమగును ||

# గురుపరంపర

పట్టదగురుండు రాజేంద్రబాలగురుని
కీ గురుపరంపర ప్రభలెఱుక పరుప,
మఠమహాశయంబులు మనంబంటుకొనగ,
ధీరగంభీర వాక్కుల, తెలియ పలికె ॥ 1

చూపులో శాంతి, పల్కుల తీపి, పెదవు
ళ్లందు చిరునవ్వు దొరలగ, నంత కంత
అమృత భావంబు లూరగ, నాత్మగదిపె
ఎదుట రాజేంద్రగురుడొప్పె నెల్లరు గన ॥ 2

భక్త మాహేశ్వర శరణ ప్రముఖులెల్ల
చేర, పేరోలగంబున, శివగురుండు
చేరి, ఓ శరణ శ్రేష్ఠులార! నేటి
నుండి రాజేంద్రుడు జగద్గురుండటంచు ॥ 3

ఈ గురువర్యులు నంత
ర్యాగ పరీపాకులయ్యు, ననుదిన పీఠో
ద్యోగ పరాయణులై, బా
హ్యాగమకృత్యముల దీర్తురందరు మెచ్చెన్॥ 4

సిద్ధగిరి నుండి శివరాత్రి శ్రీ గురుండు
వచ్చి, కపిలా నదీతట ప్రాంతమందు
నిశ్చల ధ్యాన నిరతుడై నిలువ, నిందు
శ్రోత్రియపురంబు పరమ పవిత్రమయ్యె ॥ 5

తలకాడు గాంగరాజును
పొలియింపగ కంచిచోళ భూపతి రాన్, ని
శ్చల శివగురుచుట్టుచు, ముం
గలి కేగక చోళుని తుర గంబిట చుట్టన్॥ 6

నిలచె, మహా సంగ్రామము
మొలచె, నృపుల మధ్య హృత్ప్రమోదంబీక్షా్త్మ
స్థలి సుత్తూరను పేరున
వెలసెన్, శ్రోత్రియ పురంబు విబుధులు మెచ్చన్॥ 7

రాచమల్ల రాజేంద్రచోళ నృపులేగు
దెంచి, కాన్కలర్పించి, భక్తిశివగురుని
గొలిచి, ఆధ్యాత్మ శక్తులున్ కలుగు మీరె
వీరు లీ పీఠమే వీరపీఠమనిరి ॥ 8

నాటినుండి యెడ తెగక నేటివరకు
అదియె సుత్తూరు వీర సింహాసనాఖ్య
యై, జగద్కీర్తి గని, పురుషార్థ సాధ
నమగు భక్తి పథమ్మున నడిపె, ప్రజను ॥ 9

ఈశానేశుడు పీఠా
ధీశులలో జూడ తా, ద్వితీయుండయ్యెన్
వాసింగాంచెను, చోళా
ధీశుల గురుడౌచు, నద్వితీయుండయ్యెన్॥ 10

నిజలింగ శివాచార్యుడు,
త్రిజగంబుల మెచ్చు వశి, తృతీయ గురుడుగాన్
ప్రజ గొల్వనతని హొయసల
ప్రజా ప్రభుని మండలపతి లక్ష్మయ గొలిచెన్ ॥ 11

ముసిడి చౌడయ్య శరణు డీ దిసకువచ్చి
ఇచట నిజలింగ శివగురునిచ్చ గలిసె,
ధార్మిక జన సంరక్షణార్థంబునై శ్ర
మించె, సుత్తూరు మహిమ వ్యాపింప జగతి ॥ 12

సిద్ధనంజేశదేశికుడిద్ధమూర్తి,
నాల్గవ గురుండు పీఠాధినాధుడయ్యె
అతడు యోగ విద్యా రహస్యంబులెల్ల
కరతలామలకంబుగాన్, ఘనత గాంచె ॥ 13

శూన్య సింహాసన విభుండు సుప్రసిద్ధ
మలయ మాదేశ్వరగురుండు మహిమలెల్ల
ఈ గురుని కడ నేర్చి యోగీంద్రుడయ్యె
శ్రీ సుతూరి సింహాసన శ్రీలు మెరయ ॥ 14

కాయకము సేయ కే, యెంత ఘనులకైన
బ్రతుకరాదను నంజేశు పలుకులవిని
మలయ మహదేశ్వరస్వామి, మనసు రీతి
విసరె, రాగుల నిటనున్న విసరరాయి ॥ 15

రోగ రుజనాదులెల్ల నిర్మూల మంద,
పేద సాదల రక్షించి, యాదుకొనుచు,
చివర కేకాకియై కొండ గవి తిరుగుచు,
నిశ్చల తపస్సమాధిలో నిలచె యతడు ॥ 16

నేటికి నతని మహిమ లనేకులిచట,
పల్లె పదముల ధ్వనియింప పాడు చుండ్రు,
నిండు భక్తి మాదేశ్వర కొండ కేగు
భక్తులిందు, సుత్తూరికి వచ్చు చుండ్రు ॥ 17

వీరశైవ తత్త్వంబును విస్తరించు
"వరశివాధిక్య చూడామణి" రచియించి
సాహితీలోకమందు శాశ్వత పదంబు
పొందె, కవిబుధ గురువరుల్ పొగడనితడు ॥ 18

కపిన నంజుండ దేశి కాఖ్యగురుడైద
వ గురు, డా శ్రిత జన పక్ష పాతి, సుగుణు
డాత్మ హస్తాబ్జ జనితుడార్య, శివలింగ
కవికి, ఆశ్రితదాతయై ఖ్యాతిగాంచె ॥ 19

సిద్ధరాముడు వెలివేయ, శివుని చేత,
మూట మోయించుకొని, పురంబు విడిపోవు
అముగి దేవయ్య మాహాత్మ్యమందరెఱుగ,
వ్రాసె, శివలింగ కవి గురువరుని కరుణ॥ 20

చెన్న వీరదేశికుడిట చెప్పదగిన,
ఆరవ గురుండు, శివయోగి, యగుచు శాంత
మల్లికార్జున శివలింగమందు, మనసు
నిలువ, అరకల కొడగు కొండల నడంగె ॥ 21

అతని శిష్యుడాధ్యాత్మవిద్యాప్రభుండు
సిద్ధ మల్ల శివాచార్యుడిద్ధయశుడు
చెంత జేరుచు తోంటద సిద్ధగురుని
జేరె శివయోగ రతిని కగ్గేరి యందు ॥ 22

పర్వతేంద్రుని పీఠాధిపతిని చేసి,
తాను చరలింగ మూర్తి యై, ధర తిరుగుచు,
కడకు నెడయూరి సిద్ధలింగంబు నందు
ఐక్యమై పోయె, జగములౌరా యనంగ ॥ 23

పర్వతేంద్ర శివాచార పరమ గురుడు
అష్టమ గురువుగా పీఠ మధివశించె,
కరువులో వాన కురిపించె కరుణనతడు
యోగ మహిమల కలసె సుత్తూరు లోన ॥ 24

పర్వతగురుని తరువాత వచ్చిన బస
వయ్య ఒడయరు పరశివ ధ్యానరతుడు
కాయకవ్రతుండయ్యె జగంబు మెచ్చ
విజయనగరమండల నృపుల్ వేడ్కకొలువ || 25

బండరుబసయ్య సంగమేశ్వర శివాల
యమును కపిల కౌండిన్య నద్యంబుసంగ,
మస్థలంబున కట్టించి మాన్య చరితు
నొకనినియమించె పూజకై ఉర్విమెచ్చ|| 26

సాళువ నృసింహనృపుని
కాలంబున లింగ నాయక గ్రామణియున్
శ్రీలర్పించుచుమఠ
దాలయగురువరుని కొలచె నధిక శ్రద్ధన్|| 27

శిష్యకోటి సన్మానముల్ సేయగ బస
వయ్య దవ్వు వ్వదవ్వుల పలు ప్రాంతములకు
పోయి చరలింగ మూర్తియై పూజలంది
కడకు కొడగున కల్లూరి గాలి గలిసె || 28

కూగలూరి నంజయ్య సద్గురు వరుండు
పదవ గురుడుగాన్ గురు పరంపరవెలింగె
ధర్మ పథమున నడచుచు తత్త్వమెఱిగి
మఠపు మహదాశయంబుల మనుపు చుండె || 29

విజయనగరాధికారియై వినుతి కెక్కు
ధర్మమూర్తి భద్రయ్య నాదక్షుడొకడు
చేరి నంజుండ దేశికు సేవచేసి
దాన మీ మఠంబునకిచ్చె ధరణికొంత || 30

పర్వత గురునికాలాన బాలుడగుచు
బండరు బసయ్యసేవల ప్రాజ్ఞుడైన
దివ్యతేజస్వి ఘనలింగ దేవునితడు
ఉత్తరాధికారిని చేసె నుర్విమెచ్చ ॥ 31

బెంగళూరికి చేరువవెలయుచున్న
రేవణేశ్వర గిరి గుహన్‌లీనమయ్యె
అంత సుత్తూరి పీఠమత్యంత శక్తి
మెరసె ఘనలింగ దేవర గురుడు కాగ ॥ 32

కూలికై పోవ బంగారు కుండదొరకె
మనుజుడైపుట్ట లింగ సంబంధమయ్యె
దేవ ! నానడనుడుల భేధింప నటుల
దేర్పు మని సదా నతడు ప్రార్థించుచుండె ॥ 33

ప్రణవ పంచాక్షరీ మంత్రపఠనమందు
పరమ పావనంబయ్యె నాగురుని చిత్త
మమృత సరసిలో స్నానంబు లాడుకొనుచు
శివునిదివ్యాను భూతిలో చిందులాడె ॥ 34

అణువణువులో ననుస్యూతమైయడగిన
స్థాణుతత్త్వంబు నాత్మలో దలచి తలచి
నిఖిల బ్రహ్మాండభాండంబునిండుకొన్న
అష్టమూర్తి మాహాత్మ్యంబు నర్చసేయు ॥ 35

కపిల మునిగి గంగాధరున్ కౌగలించు
చంద్రసూర్యాగ్నులన్ త్రిలోచనుని తరచు
సృష్టి సౌందర్యమున్ చూచి శివుని మెచ్చు
పార్వతీపతిధ్యానాన ప్రకృతి మరచు ॥ 36

పూల జూచుచు నాతండు పులకరించు
పాల ధారల నాచంద్రమౌళి నరయు
తేనె జూచుచు శివునిలోలీన మగును
పూజలుడిగి పూజా ద్రవ్యపూర్ణుడయ్యె॥ 37

అతని వాక్ఝరి స్త్రీరూపమంది వాణి
కాగకన్నడాంబికయు బంగారు బట్టు
బట్టలు ధరించి శివగీతి పాడుకొంచు
విశ్వవీణకు జీవమై వినుతికెక్కె ॥ 38

నీలతో యదమధ్యస్థునిన్ తలచుచు
నిశిత నీవార శూక సన్నిభుని గాంచి
అంతర బహిరంగముల నాటాడుచున్న
సమరస శివ శక్తుల జూచి సంతసించు ॥ 39

శివుని రాజ్యాన జీవుల సృష్టినెఱుగ
ప్రాణికోటికి దుర్లభంబౌను గాని
పరిణత జ్ఞానికిదియు దుష్కరము కాదు
చంచలంబున సౌందర్య సత్యమణగె॥ 40

కంటబడని భవునికై కష్టపడనేల ?
కంట బడియు స్థిరత గాంచనట్టి
జగతి నమ్మనేల ? సత్యంబు తెలియగ
తన్నుదానరయుట ధర్మ మగును ॥ 41

తాననుఁ ఎవరో తెలియుట
జ్ఞానము, జ్ఞానంబు కలుగ సర్వజ్ఞుడగున్
కాని యిదియు నా యింద్రియ
జ్ఞానంబుగ తలపరాదు చపలుండగుచున్ ॥ 42

ఇంద్రియములడంగ యీ దేహము నశించు
ఇంద్రియముల మూలమెఱుగ ప్రకృతి
ప్రకృతి బంధము తెగ పారమార్థిక సత్య
మరయ వచ్చు సర్వమెఱుకపడగ॥ 43

లోకము వలె ఇంద్రియములు
చీకాకుంగలుగ జేసి స్తిమితమడంచున్
ఏకాకృతి వెలుగు వెలుగె
ప్రాకటముగ సత్యమంచు ప్రాజ్ఞుడెరుంగున్॥ 44

సత్యము చైతన్యంబగు
సత్యమె ఆనందమగును సర్వాత్మకమై
సత్యము జ్ఞానంబగునిది
నిత్యము నిర్మల మచలమనిత్య ప్రకృతిన్ ॥ 45

పురుషుడెంత సత్యమోయంత నిత్యంబు
సృష్టి, ఆతడెంత చేతనంబొ!
ప్రకృతి యంత సుందర ప్రభ, అతడెంత
శివమొ శక్తి యంత శివకరంబు ॥ 46

తన్ను తానెరిగిన తక్షణంబె, తనకు
కన్నులుండి తాను గాంచకుండు
వీనులుండి తాను వినకుండు, తాను చై
తన్యమగుచు జగతితగులు కొనడు ॥ 47

ఐక్యుడెపుడు సూర్యుడై శ్రమించుచు, తను
ధనమనోత్రయంబులణగగ, గురు
లింగ జంగములకు ప్రీతి నర్పించి, దా
సోహియగుచు వెలుగు శూన్యవీధి ॥ 48

చేయుచుండుగాని, చేతలంజిక్కడు
కర్మ ఫలముగొనని కాయకమున,
జంగమమగు, జీవ జగమెల్ల వానికి
సత్యసుందరముగ స్పష్టమగును॥ 49

వచనకారుడై కన్నడ బాస నిలిచె
విపుల వేదాంత వేద్యుడై వీర పీఠ
మెక్కె, ఘనలింగ శివయోగి యీ జగత్తు
కెల్ల గురుడౌచు కలిసె, కగ్గేరి లోన॥ 50

అతని వెనుక సుత్తూరి సింహాసనంబు,
ఇమ్మడి శివరాత్రి గురుండు నెక్కగ, "వృష
భేంద్ర విజయ పురాణమున్" విధి రచించి,
కడకు సుత్తూరు గాలుల కలిసె, నతడు ॥ 51

సుత్తూరిపైన సుంకపు
విత్తము గురుకాన్కకాగ విడిచి, కొలచె, ఉ
మ్మత్తూరు భుజంగనృపుడు
సుత్తూరి శివ గురుని కరుణ చూరగొనంగన్॥ 52

చెన్న బసవదేశికుడంత, సింహపీఠి
వెలుగ, విజయనగర మేలు వేంకట పతి
మండలేశుడౌ, ప్రముఖ రామాఖ్యుడిటకు
వచ్చి, గురుకాన్కలర్పించె, భక్తితోడ ॥ 53

ఇతడు చరలింగమూర్తియై యిల తిరుగుచు
ఉత్తరావనిలో శివయోగ నిరతు
డయ్యె, నంజేశుడీ పీఠమధివశించి
సాధు సజ్జన సంగమోత్సాహియయ్యె॥ 54

కేరళావని తిరుగు చీ వీర గురుడు,
కపిల జన్మ స్థలంబున గలిసె శివుని
అంత భక్త మాహేశ్వరులాది జనులు,
చుట్టు జుట్టుచుజేజేలు పెట్టుచుండ ॥ 55

చెన్న బసవ శివాచార శ్రీ గురుండు
పట్టభద్రుడుగాన్ మత ప్రభవెలింగె,
జగతి, వర సాహితీ శరశ్చంద్ర చంద్రి
కాధవళరుచిన్ సరసుల కాంతి దనిపె ॥ 56

ప్రీతి రేవణారాధ్యుని బిల్వబంచి,
పట్టుబట్టలు తాంబూల ఫలములొసగి,
హిత మిత ప్రియోక్తుల రసహృదయమలర
పలికె, సుత్తూరు పీఠాధిపతి, నయమున ॥ 57

ప్రథిత యశంబందగ, స
ద్విధి "న్శివాధిక్యమణికి", విపుల వ్యాఖ్యన్
గ్రథితంబొనరింపుము, త
త్వ ధనులు కీర్తింప మీ యపారప్రజ్ఞన్ ॥ 58

అన ఆరాధ్యుడు తత్వం
బునకనుగుణముగ విమర్శ పూరించె, గురుం
డును పంచాక్షరి దేశికు
ని, నిలిపి, గురుపీఠమందు నిజగతి నేగెన్ ॥ 59

అంత శ్రీరంగపట్టణప్రాంతమున, ప
విత్రవాహి నీ సైకత వేదికాస్థ
లంబుల, ప్రశాంత సమయంబులన్, పరాత్ప
రు, తరుణేందుశేఖరు, శివున్, మతినుతించు ॥ 60

చూపునాసాగ్రమున నిల్పి, సూర్య చంద్ర
నాడుల బిగింప, కాలంబునడువుదయ్యె
దేహముండియులేనట్టు దేలుచుండె,
నిశ్చల ధ్యాననిష్ఠుడైనిలుపమనసు॥ 61

ఇదియెరింగి మాహిష్మతీ నృపుడు, కృష్ణ
రాజ ఒడయరీతనికి, శ్రీరంగ పట్ట
ణమున కట్టించె, శాంతిధామ, మది విడిది
కాగ నృపసేవలందె, యాజ్ఞానయోగి॥ 62

పోయిపోయి శివ సముద్రపుదరి, దుముకు
చున్న కావేరి గట్టున, పున్నెపు"మిళి
వాళ" మందు, లింగార్చన పరతమునిగి
బసవశివుడాత్మ సుందర ప్రకృతి గలిసె ॥ 63

ప్రణుత పంచాక్షరీ ప్రభావంబు నెవ్వ
డెల్ల వారలకింటింట నెఱుకపరచి,
ఆయురారోగ్య భాగ్యంబులంద జేసె,
చివరకన్నియు త్యజియించి, శివుని గలిసె॥ 64

పావనంబైన శ్రీరంగ పట్టణమున,
స్థిరతపశ్చిమ వాహినీ తీరమందు
నిలచి, తరుణేందుశేఖరున్ గలిసిపోయె,
కడకు పంచాక్షరీ దేశిక ప్రభుండు ॥ 65

అతని తరువాత, గురు పీఠమధివశించె,
జనులు మెచ్చ, చిద్ఘన శివాచార్యుడతడు
యోగ శక్తుల బండించి, యుర్విగాచె,
కడకు సుత్తూరు గాలుల గలిసిపోయె ॥ 66

చెన్నవీరగురుడు, సింహాసనాసీను
డై, జన పదముల, మఠంబులన్, సృ
జించుచు, జనతతికి శివధర్మమున్ చాటి
ధర్మ కార్యరతిని దగిలి యుండె || 67

ఉడిపి శంకర నారాయణోర్వియందు,
మఠము నిర్మించె, మైసూరు మహిని యేలు
హైదరాలి దేశికుని ధర్మానురక్తి
తెలిసి, నతనికి, తోడ్పడె యిల నుతింప || 68

శివుని విభవంబు, ప్రకృతి దర్శించి, గురుడు
కొడగుభూముల "కాళంగరడి " కడ, నొక
మఠము కట్టించె, ఆజనంబాదుకొనగ
భక్తి శక్తి స్వరూపమై పరిమళించె || 69

తిరిగివచ్చుచు లక్షణ తీర్థమందు,
మునిగి యాసృష్టి సౌందర్యమునకు, మేను
పుల్కలం బుట్ట, శివునాజ్ఞ పూర్ణుడగుచు
చెంత సింగన హళ్ళిలో సిద్ధుడయ్యె || 70

అంతట మహంత దేశికుడధివశింప,
శ్రీసుతూరు సింహాసన శ్రీలు వెలిగె,
అతని వదనంబునమృతాంశుడందగింప,
ఆనగవు జగచ్ఛాంతికి స్థానమయ్యె || 71

అతని బల్కుల వాగ్దేవిశ్రుతిని గలుప,
పండితుల మనంబానంద భరిత మయ్యె
అతని గుండె శ్రుతి స్మృతులలముకొనగ,
ప్రజ సదాచార సంపద బ్రతుక నేర్చె || 72

అతని కనుపాపల, శివుడాటాడుచుండ,
భక్త మాహేశ్వరాది ప్రపంచమెల్ల
దరిసి, కే లెత్తి మ్రొక్కె సంతసముతోడ
యీప్సితార్థంబులెల్ల సిద్ధించు చుండ ॥ 73

ఆది గురుల సమాధి మఠాంగణంబు
నప్పుడపుడు జీర్ణోద్ధారమతడు సేసె,
బసవ లింగ దేశికుని యేర్పరచి ఉత్త
రాధికారిగ, తాను ప్రవాశియయ్యె ॥ 74

కేరళావనితిరుగుచుచేరు భక్త
జనులకు, శివోపదేశమున్సలుపుచుండ,
బసవలింగదేశికుడు శివైక్యమగుట,
తెలియగానె సుత్తూరికేతెంచె గురుడు ॥ 75

మరల మఠము చేరి, మఠకార్యముల్ దీర్ప
ఈ మఠ ప్రశస్తి యెల్లదిశల
గ్రమ్మ, రేవణార్యరంభాపురీ పీఠ
మున విపత్తు పుట్టె, ముట్టెనృపుని ॥ 76

ప్రభుడు ముమ్మడి కృష్ణరాడ్విభుడు వచ్చి
ఇందు రంభాపురీ పీఠమందు, పుట్టె
తగవు, స్థిర చరమూర్తులిద్దరికి మధ్య,
దాని సరితిద్దు దక్షులు తమరెయనగ ॥ 77

పయనము మహాంత దేశిక ప్రభుడుసేసి
చేరె ఎడయూరికిన్, ముందె సేరుకొనిన
ఆ గురుద్వయంబును చూచి, ఆదరమున
హితమిత ప్రియోక్తుల వారి యెదల గదిపె ॥ 78

స్థాణువే స్థిర రూపమున్ దాల్చు శివము,
శక్తియే, చర రూపమై జంగమమగు
స్థిర చర శివ శక్తుల వేరు సేయ దగునె ?
ఒకటి రెండయ్యె, ఆ రెండె ఒకటి యగును || 79

చంచలతరంగ రూపమే జంగమమగు
కణకణో జ్వల స్థిరత లింగంబునయ్యె
సత్యమునకీచరాచరశక్తి శివులు
రెండు ముఖములై కన్పట్టు చుండు పైకి || 80

కదలు చుండి కదలని భూగ్రహమురీతి
కదలక కదలునట్లుండు కమల బాంధ
వుని గతిన్ విపరీతమై పొదలు చున్న
బాహ్య దృష్టికి ప్రాజ్ఞుడు పట్టుబడడు || 81

అనుడులె, రూపుకట్టి సాక్షాత్కరింప,
ముందట మహంత దేశిక మూర్తిలోన,
రేణుకా చార్య శివుని దర్శించి, వారు
ప్రణుతిసేసిరి భక్తి ప్రపత్తి నతని || 82

సార్థకంబయ్యెనారాక, యంచు గురుడు
వచ్చి సుత్తూరి కీ శుభవార్త తెలియ
చేయ, కృష్ణరాణ్మణిగురున్ చేరి మ్రొక్కె
ఈ మత ప్రభావంబెల్ల యెడల నలమె || 83

సిద్ధలింగ శివాచార్యు చేరదీసి,
ఉత్తరాధికారిని చేసి, ఒప్పచెప్పి
మఠము, తన్ను దా తెలిసెడి మార్గమరసి
తుదకు బయలయ్యెనతడు సుత్తూరు లోన || 84

సిద్ధలింగశివాచార్యుడిద్దయశుడు,
శ్రీసుతూరి సింహాసనాసీనుడయ్యె
త్రివిధ దాసోహమొనరించి, దినదినంబు
దనిపె గురులింగ జంగ మత్రయి, నతండు || 85

భక్త జనుల తపోధనవ్రతుడతండు,
దార్శనికుల దృష్టిదవులు తత్త్వవేది
కవుల పాలిట కల్పవృక్షంబు, దీన
దళితులకనుక్షణంబు చింతామణి యగు|| 86

ఎవడు షట్కాల శివపూజ, నెవ్వడు శివ
తత్త్వగోష్ఠిమున్గు, నెవడు దాత, ధాతు
కరువునం దాశివాచార గురుని పొగడె,
నగర నంజుండ శాస్త్రి జనాళి మెచ్చ|| 87

ఆ శివ గురుని నిష్ఠ, దయ, సరసార్ద్ర
హృదయమెరిగి, ప్రజలు గొల్వ, నృపులు గౌర
వింప, కవులు పాడగ, తత్త్వ వేది తహత
హ పడ, నతడు జగద్గురుండయ్యెనాడు || 88

కంబళేశయ తీ, గురున్ గాంచనెంచి,
ఆశ్రమమునకేతేర, ఆచార్యుడతని
యోగబలమును గుర్తించి, యోగ్యమైన
ఆ శ్రమంబు "మల్లన మూల" నతనికిచ్చె|| 89

ఆతడాస్థలంబున నిల్చి, ఆత్మ దర్శ
నార్థమరుదెంచు భక్తుల కాదరమున,
యోగ శక్తుల దివ్యాన్న మొదవ, వారి
ననుదినము తృప్తులంజేసి పనుపుచుండు || 90

అంత నంజన గూటికి, అనతిదూర
మందు, నయ్యతి "మూల" యందైక్యమయ్యె
సిద్ధలింగ శివగురుండు చింతలుడిగి
తుట్టతుది బయలయ్యె సుత్తూరులోన ॥ 91

సిద్ధలింగ శివగురుని శిష్యరత్న
మమృతహస్తాబ్జ జనితు, డాధ్యాత్మవిదుడు,
వచ్చి శివ రాత్రిదేశిక ప్రవరుడనగ
అధివశించె, సుత్తూరి సింహాసనంబు ॥ 92

సతతమంతర్ముఖుండౌచు, సాధుజనమ
నోను రాగియై, హర పదధ్యానమందు
మునిగి, దేశకాలంబులముట్టకప్పు
డపుడుకను నిచ్చి, శ్రీమఠంబరయుచుండె ॥ 93

వీక్షణమున ఆదివ్యాధి పీడలడచి
భస్మమిచ్చుచు, భవరోగ వైద్యుడయ్యె
కాని దైనందిన క్రియన్ పట్టు కొనమి
గురుడు, శ్రీ మఠకృత్యముల్ కుంటువడియె ॥ 94

సర్ప భూషణయతి, ప్రభుస్వామి, సిద్ధ
లింగపతి, శివరామ శాస్త్రియును, షాహూ
కారు లింగయ్య, సిద్ధయ్య "కారెమ" కడ
శ్రీమఠంబును గూర్చి చర్చించి రంత ॥ 95

హర సాక్షాత్కారంబున
కురకలు వేయు గురుని, శివయోగము పండన్,
స్థిరమై మఠదినచర్యలు
పెరుగన్, భంగంబుగాక వీక్షించుటకై ॥ 96

సిద్ధ మల్ల శివ గురునాశీస్సులంది,
ఎవ్వడైదేండ్ల బాలుడై యెదిగె, నెవడు
బాల్యమందు శివస్వామి పజ్జ సేరి,
నేర్చె నిష్ఠాగరిష్ఠలింగార్చనంబు || 97

అమర భాషా విశారదుండయ్యెనెవడు,
జ్యోతిషాది శాస్త్రంబుల చూడనేర్చె
షోడశశరద్వయస్కుడై సుందరుడగు
నట్టి నేర్పరిని, మతకృత్యముల దీర్ప || 98

నిలుప దలచుచు దేశికుని, దరియంగ
వారు, యోగి నేత్రములు విప్పారె, గురుడు
నెదుట నిల్చిన శరణుల హృదయ మెరిగి,
భావి గురునిశ్చయించుచు, బలికె నిటుల || 99

భావముఖమున నిలచు ప్రజ్ఞావిలసితు,
డిహపరంబుల సాధించుమహిత యశుడు,
కాయక వ్రతంబు నడుపు ఘనుడితండు,
పట్టద శివరాత్రి గురుడై ప్రబలు నంచు || 100

పలుకుచు, మదీయ శిరమున పాణినిడగ,
అంత నాకీ చరాచరంబైనజగతి,
గిరగిరన్ కంటి ముంగిట తిరుగసాగె,
అప్పుడే నెటనుంటినో అరయకుంటి || 101

మద్గురుండంత యోగనిర్మగ్నుడయ్యె
భక్త మాహేశ్వరాది శివ ప్రమథులు
సేరి, నన్ను సింహాసనాశీను సేసి
పట్టదశివగురుండంచు బలికి రందు || 102

శరణులు దలచు వానికే గురువరుండు
శక్తి పాతంబుగా వించె, సాదరమున,
వీర పీఠమర్పించి దీవించె, శివుని
దయ సహస్రముఖంబులై తలుపుదీయు ॥ 103

ఇష్టలింగార్చనావ్రతం బీశ్వర పద
చింతనామృత పాన విశేష చిత్త
మంది, పూర్వగురుల మార్గమందు, నన్ను
నాటి నుండియు నడిపె నిందాక శివుడు ॥ 104

అన్న మిడి తల్లివలె ప్రజ నార్తి నడచు,
తండ్రివలె బ్రోచు, తమ సాంథతను తొలచుచు
జ్ఞాన శిఖివెల్ల జగతినే గాచు, నేటి
నుండి రాజేంద్రుడు జగద్గురుడటంచు ॥ 105

ధీర గంభీర వాక్కులన్ దెలిపి సభను,
వీడె, మఠమహత్కార్యముల్ విడివడ, గురు
డంత నొక్క ప్రశాంత గృహమ్ము సేరె
శరణులద్భుతానంద సంభరితులైరి ॥ 106

సతతమంతర్ముఖుండై, శశాంకశేఖ
రు, శివు, చూడ, పంచాక్షరీలోలుడయ్యె,
కాని అందందు కలరీతి కంటబడుచు
శివుడు, మంత్రమహర్షికి చిక్కడయ్యె ॥ 107

ఆదిగురునాత్మ మతి మతి నతడు దలచి
మంత్రమున్ వదలక సదాస్మరణసేయ
చెంతచేరెడి నిజగురుశ్రేణి నెఱిగి
అంతులేని తృప్తిని అతండనుభవించు ॥ 108

అక్షయ పదంబు ప్రాపించినటు పరాభ
వాఖ్య వర్షంబునందు, పుష్యసితదశమి
పైనయే కాదశిన్, పుట్టు భానువార
మందు మంత్రమై పోయె మహర్షి గురుడు ॥ 109

స్నేహ ముండు వరకు చిచ్ఛక్తి చే, వత్తి
నిర్వి కారకాంతి నిలచి వెలుగు
అసువులుండు వరకు నాత్మ శక్తి మెరయు
తప్ప, వత్తి రీతి తనువు కాలు ॥ 110



మనసులేకున్న జననమే మహినెరుగము
కాలమే లేక మరణంబు కలుగదెపుడు
మనసు కాలంబులన్ గెల్చు, మదన హరుని,
కాలకాలుని, గొల్వ సౌఖ్యంబుగలుగు ||

# మహోపదేశము

రజతిగిరిపైన కొలువున్న రాజమౌళి
కరణి, శివరాత్రి రాజేంద్ర గురువరుండు
వీర సింహాసనాధ్యక్ష పీఠమందు
వెలిగె, పట్టద గురునాత్మ దలచుకొంచు ॥ 1

చూపులోవెల్గు, మాటలో తీపి, పెదవు
లందు లేనవ్వ , తళుకొత్త నంతకంత
ధీర గంభీర భావముల్ తేట పడగ,
శరణులు శిరంబులూప, సద్గురుడు బలికె ॥ 2

చెఱకు తీపి, వేము చేదు, మిరప కార
మీ, ప్రభేద మాత్మ సృష్టి సృష్టి
అయ్యె, కాని అంటియంటకీ ప్రకృతిక
తీతుడౌ పర శివు, దెలియ వలయు ॥ 3

ఎవ్వడిచ్చెనోయీ గాలి, యీ వెలుంగు
ఈ జలంబీ, పృథివి, మూల మెరుగ వలదె ?
ఈశ్వర ప్రసాదిత మంచు నీవిభూతి,
ఈశ్వరార్పణ మొనరించుటే ఘన విధి ॥ 4

తరిగినంత సుగంధ మందరికి నిచ్చు,
కాచిన కొలంది వన్నెల గ్రక్కు చుండు,
చెట్టు కంటె, పసిడి కంటె, శ్రేష్టుడయ్యు
మనుజుడేటికో, శివ పదంబందు కొనడు ॥ 5

పరహితార్థమై వృక్షముల్ బ్రతుకు చుండె,
పరహితార్థమై గ్రహములు తిరుగుచుండె,
పరహితంబష్టమూర్తియే ప్రకృతి యయ్యె
త్యాగ వరమైన నరుడె స్వార్థ పరుడయ్యె ॥ 6

వేదముల్ జూచు వాడును వెతలచిక్కె,
రాజ్య మేలు భూపాలుడు రక్షణ చెడె,
దక్కువారల దుఃఖంబు తలప వలెనె ?
అన్నిటికి అహంకారమే ఆద్యమెరుగ ॥ 7

దేహిసదసద్వివేకంబు తెలియమి అభి
మానియై ద్వేషరాగ సంభరితడగుచు
కర్మ జాలంబులో బడి గతి నెఱుగక
జనన మరణాల చర్వితచర్వణుడగు ॥ 8

ఈశ్వరానుగ్రహ ప్రాప్తి యేర్పడంగ
దుఃఖభాజనంబగు జన్మ తొలుగి పోవు
భక్తిచే శివానుగ్రహ ప్రాప్తి కలుగు
జీవుడంతలింగైక్యుడై సిద్ధి పొందు ॥ 9

పండితుడు గర్వ సహితుడై, బల్లిదుడు క్ష
మారహితుడై, ప్రియంబణ గార నరుడు,
లోభియై ధనికుడు, బాధలు పడుచుండ్రి,
త్రివిధ దాసోహ మీ వెతన్ దీర్ప గలదు ॥ 10

హరుని శక్తి దివ్యమై పొంగ, భూమిపై
సంగన బసవయ్య జన్మదాల్చె,
శైవ మందు క్రొత్త శక్తులు పుట్టె, ని
హ పర ధర్మ సాధనార్థమరయ ॥ 11

సత్యము, దయ, అహింస, సౌజన్యము, విన
యంబు, శాంతి, క్షమాది గుణంబు లొప్పు
శరణుల చరిత్ర కాయకాంతర విభూతి
ఇష్ట లింగార్చనా క్రమంబిలకు రక్ష ॥ 12

పైకికాయకంబు పాటించుచున్, ఆత్మ
నిష్ట లింగపూజ నిచ్చ సేయు,
శరణుడెపుడు లోక సంస్కారి యౌచు, తా
నాత్మ శక్తి శివుని యందు చేరు || 13

చోళ నిర్మిత సోమేశ్వరాలయమున,
మరల బంగరు వన్నె గోపురము మెరసె,
హొయసలుల పురా శిల్పంబు హొయలు మీరె,
గురుని చూపులో కట్టడాల్ కూడుకొనియె || 14

పరిగలబడి చెడిన చేలు, బాగు పడియె,
పచ్చ పచ్చని పైరులు ఫలములిచ్చె,
పండ్ల తోటల చిల్కల బ్రతుకు పండె,
పంచమస్వరంబున శివున్ పాడె పికము || 15

గట్టుపైన వీరాలయ కట్టడమును,
అండ పీఠ విమాన శివాలయమును,
ముంగిట మఠజీర్ణోద్ధారమున్ సలుపుచు,
పట్టద గురుండు, కార్యతత్పరతమునిగె || 16

చుట్టుపట్టుల పొలముల మట్టి నడగు,
మఠ శిలా శాసనంబుల, మది నెరింగి,
పైకి దీయించి, చదివించి, భద్ర పరచె
మఠ విశాలాంగణంబున, మంది మెచ్చ || 17

సంస్కరింప ప్రజల, సంస్కృత విద్యాల
యాల నిలువ చేసె, అచ్చటచట
కాయక వ్రతాన కైలాసనాథుని
తృప్తి పరచె, భక్త బృంద మలర || 18

ఎవడు పంచాక్షరీ మంత్రమెల్ల వేళ
నాత్మ జపియించి, భక్తి నాయక్షరాళి,
క్రమము తప్పక రచియించి ఖ్యాతి గాంచె
మంత్ర మహఋషి గ, నతడే మనకగు గురి || 19

అదె మన పైబడి చైనా
కదనాగ్ని జ్వాల లెగసి, కరుగగ హిమ వ
త్పదములు, రేగన్భారత
హృదయంబుల రుద్ర కీల లెదురై నిలుపన్ || 20

కోరకనే, మన యీాస
ర్కారున కాత్మాభరణములన్ కాంతలు, బం
డారములన్ ధనికులు, యువ
పౌరులు దేహంబు లీయ, పై బడు చుండన్ || 21

ఖాదీ కావుల గట్టిన
సాధువు, పట్టద గురుండు, సమయజ్ఞుండై
తా, దేహ స్థిర శివర
క్షోదితవసులింగ పేటి, నొసగివచించెన్ || 22

శివ రక్షాకవచంబై,
ప్రవిమల దేహంబు నింత వరకును, రక్షిం
చు, విశిష్టంబగు, నీ హై
మవతీ శక్తి మన భరతమాతను గాచున్ || 23

శస్త్ర నిర్మిత శాలలై శాలలింక,
సుభట శిక్షణ సంస్థలై, సుప్రసిద్ధ
పట్టణములు దేశంబుతో పాటు ఆర్ష
ధర్మ సంరక్షణార్థమై, దనరు గాక || 24

విజయ నగర సంస్థాపనా విభవమునకు,
శారదా పీఠ భాగ్యంబు సముచితముగ,
చూర విడిచినవారు మా వారు వారి
ఆ మహాశక్తి మాలోన ఆరలేదు || 25

అని మనగురుడున్ శంఖం
బును పూరింప, భరతాంబ పొంగె, ప్రజల్ మే
ల్కొని, రిక యుద్ధంబిటతగ
దని, చైనీయులల నల్ల నణగారిరటన్ || 26

దేశ సంరక్షణార్థమై, దేహ మాహ
వ సవనాగ్ని కర్పింప, నెవ్వండు ముందు
కురికె, ఆ శివరాత్రి సద్గురుడహరహ
మాత్మ సిద్ధికై పరశివధ్యానియయ్యె || 27

అమర మందాకినీ పవిత్రాంబుకణము
లీ, యనంత కోటి ప్రాణులీశుచేర,
తోడ్పడి మలత్రయంబును తొలచు, మంత్ర
గురుని చైతన్య శక్తియే వరము, మనకు || 28

ఆదిగురువులు నడచిన ఆశివ పథ
మాత్మ రక్షణో పాయమై, అలరుగాక
అనుభవాత్మక సాహిత్యమందచేయు
శరణుల, ఉపనిషద్వాణి మెరయు గాక || 29

సకల దేవతా మూర్తియై జగములేలు,
ఆపరాత్పరు, శంభునవ్యాజరక్తి,
జీవకోటికి సౌఖ్యంబు చేపు గాక,
నిత్య చైతన్యయై సృష్టి నెగడుగాక || 30

పలుకుల గుణంబు చూడమేన్పులుకలెగసె,
మనసు నెటినెంచ, కనుల కంకణములయ్యె
గురుని వాక్ర్పభల్ నిజ.భక్త కోటి దనిపె,
శివుడె మెచ్చనిమ్మహియె, విచ్చె విరివోలె ॥ 31



అన్నమున దేహి బుట్టుచాయన్న ముననె,
పెరిగి, తుదకన్నమై పోవుటెఱిగి నరుడె,
అన్నము ప్రసాదమని దాని నార్తి జనుల
కొసగ, తా, నమృతానంద యోగి యగును ||

# అమృతఫలాలు
# ప్రసాదము

ఒక్క నాడు మాహిష్మతిన్, తక్కిన సహ
చరులతో విద్య నేర్చెడి తరుణమందు,
ముందుగలరావి వృక్షంబు క్రింద, మూల్గు
చున్న బాలుని దృశ్యంబు చూచె గురుడు ॥ 1

వెంటనే సహచరులతో వృక్షపుదరి
మూల్గుపశివాని దెప్పించి, ముందు నిలువ,
వాడు గొంతు దడుము కొంచు, పైకి చూడ,
వాని ముఖముపై నీర్జల్లి పజ్జచేర ॥ 2

ఆతడేవొ ! గొణగు, మాటలరకొర విన
రాగ, గంజి, వే, తెప్పించి త్రాపె గురుడు
గురుని యాసమయ స్ఫూర్తి వరము కాగ,
తిన్నతిన్న గ బాలుడు తేరు కొనియె ॥ 3

గంజి కడుపున బడగానె, కనులు విచ్చె,
అతడు తన సంచి గల పుస్త కాళి తడుము
కొంచు, లేచి, చుట్టును మూగు గుంపునగల
గురుని చూచి యెల్గెత్తి బిగ్గరగ ఏడ్చె ॥ 4

బాల రాజేంద్ర గురుడు, నబ్బాలు జూచి,
కరుణ కన్నుల దొనకగ, కడుపు చేత
కలచి నట్లుగాన్, దుఃఖించు కంద నరసి,
ఆదరంబున చేర్చి ఓదార్ప వాడు ॥ 5

అయ్య ! మాయూరు చాలదూరాన కలదు
కలదు నాకు మాతల్లి యొక్కర్తె, ఇంట,
చదువుపై ఆశ పడి ఏ నిచటికి వచ్చి,
చదువు చుంటి, వారాన్న భోజనములంది ॥ 6

ఇంతలో నాయదృష్టంబు నేమి చెప్ప,
నాకు రెండు దినంబులన్నంబు పెట్టి
ఉన్నతోద్యోగులిద్ద రీయూరు విడిచి
ఎటకొ మారిపోన్ నా బ్రతుకిట్టులయ్యె ॥ 7

కట్టు బట్టలు కరువయ్యె, కడుపు జూచి
వేళ వేళ కన్నము బెట్టు ప్రీతి తల్లి
నాకు కల్గియు కల్గదీనాడు, నకట!
పరుల పంచ లిట్లెన్నాళ్ళు బ్రతుక వలెనొ!॥ 8

ఈ చదువు చాలు నింకనేనెట్టులైన
ఇల్లు చేరి చూడ వలె నాతల్లి నంచు
వెక్కి వెక్కి యేడ్చుచు తన్ను పిన్న వాడు
చూడ, గురుని కన్నుల వెత సుళ్ళు తిరిగె ॥ 9

నాటి యా చిన్న వాని కన్నంబు పెట్టి,
సేద తీర, కొంత ధనంబు చేతికిచ్చి,
ఇంటి కేగుమా యంచు బంపించె, నంత
గురుని నిట్టూర్పు లో దోచె, కోటి వెతలు ॥ 10

అన్నమున దేహి బుట్టుచు,
అన్నంబున పెరుగుచుండె, నఖిల ప్రాణుల్,
అన్నంబులేక యుండిన,
మన్నైపోదె జగమెల్ల మరు నిముసములోన్॥ 11

ధర, పరోపకారార్థ మిదం శరీర
మని బ్రదుకు వారికి ప్రసాదమయ్యె అన్న
మిదియె, సంకుచిత స్వార్థ హృదయులకిల,
పట్టు బడకహాలా హలం బౌచు, నడచు ॥ 12

చదువుకై యెందరీ రీతి శక్తి లేక,
ఇట హతాశులై పోయిరో, యెరుగ మంచు
మొలకలో చీడ బట్టిన తలప దగునె ?
భావి కల్పంబులంచు తా బాధ పడియె ॥ 13

అను దిన, మనాది విద్యార్థి జనత పెరిగె
కాని రాబడి మార్గంబు కానదయ్యె,
చూడ పట్టద గురునికీ సుద్ది తెలియ
దయ్యె, సీమిత గ్రాసంబెయతడు బంపు ॥ 14

బాల గురునికీ పోషణ భార మధిక
మయ్యె, కాని లెక్కింపక అన్నిటికిని,
ఆది శివరాత్రి గురుదేవు డాత్మ రక్ష
యంచు, సంస్కృత విద్య నార్జించు చుండె ॥ 15

బసవ రాజయ్య బోధించు, పాఠములను
క్రమము తప్పక నేర్చి సారంబెరింగె,
ఆత్మ విద్యా ప్రభావంబు, ననుభవింప
ఉపనిషత్తుల గాలించె, నుత్సుకతను ॥ 16

చదువుల చదివి, బ్రహ్మయై బ్రదుక వచ్చు,
సిరుల బొంది శ్రీకాంతుడై మెరయ వచ్చు
కాని తరియించు మార్గంబు గన నరునకు
జీవ కారుణ్యమొకటియే, శివ పదంబు ॥ 17

దయలేని ధర్మమున్నదె ?
దయయె సకల జీవులకును తలమానికమౌ,
దయ, సత్యాహింసల నిధి,
దయయే మూలంబు నిఖిల ధాత్రీ స్థలికిన్ ॥ 18

ఎవ్వడు దయా సముద్రుడై నివ్వటిల్లె,
ఎవడు ముందు వెన్కలు చూడకీయ నేర్చు,
అతడు రూపనామ క్రియా రహితుడు,
పూర్ణుడై, లింగమూర్తిగ, పూజ్యుడయ్యె ॥ 19

అష్టమూర్తియయ్యు, హాలాహలము మ్రింగె,
గంగ నెత్తికెత్తె, కట్టెతోలు,
పాపలమెయిదాల్చె పరహితార్థంబుగా,
మెరసె, దేవుడయ్యెమృడుడటంచు ॥ 20

హఠయోగారూఢుండై
అరవిరిసిన హృత్పయోజమందున, యోగీ
శ్వరుడౌ శివరాత్రి గురుని
స్మరియించుచు, మ్రొక్కె, నాత్మ సంతృప్తిగనన్ ॥ 21

బుద్ధీ ! గ్రాసాధిక మీ
ప్రొద్దున నిండుకొనె, వంటసేయుట కష్టం
బిద్దరి, యని పాకజ్ఞుడు
తద్దయుదరిజేర, గురుడు తప్పుండగుచున్ ॥ 22

మెడదడిమి, లింగమూర్తిని
కడు భక్తిన్ దలచుకొనగ, కాంచన మయమై
విడివడని మధ్యమణిని, గు
రుడు దండను త్రిప్ప దోచె, రుద్రాక్షులలోన్ ॥ 23

నూరారు మంది శరణులు
చేరి ప్రసాదంబుగొంచు, శివనామంబున్
నోరూర పొగడు, దృశ్యము
స్మేరాననుడై గురుండు చింతించె నిటుల్ ॥ 24

ఈ రుద్రాక్షులలో, బం
గారున బంధింప బడిన, కైలాస పతిన్
వేరుగవిడదీసి, కొలువ
చేరెడి శరణులకు నాకు సేమంబనుచున్ ॥ 25

తన లింగపేటిబంగా
రు, నుంగరము, విక్రయించి రుద్రాక్ష సరం
బును మాత్రదాల్చె, వచ్చిన
ధనంబు ప్రసాదమునకు తావెచ్చించెన్ ॥ 26

ఈ వృద్ధి క్షయములకిల
భావింపగమూల మొక్క వస్తువె, యైనన్
భావి భవిష్యత్తులు, య
ద్భావంతద్భవతి యనగ, పరిణామమగున్॥ 27

అక్షయమౌ ద్రవ్యంబును,
శిక్షాధిక కార్యములకు స్వీకృతమైనన్
లక్షాధిక విద్యార్థుల
రక్షాకవచమగునని, దలంచె గురుండున్ ॥ 28



విశ్వమంతయు తనదౌను, విమతులన్న
మాటయే లేదు, రాజ సన్మాన మబ్బు,
స్థిరపదంబిచ్చు, సర్వార్థ సిద్ధిగూర్చు,
ఇచ్చినంత పెరుగు, విద్యకేది సాటి ? ॥

# ఆనంద భిక్షువు

షాహుకారని మైసూరు జనత పొగడ,
ధర్మరతుడని బుధులు స్తోత్రంబు సేయ,
వర సదాచారియని గురుల్ పలుకుచుండ,
సిద్ధ లింగయ్య నాడు ప్రసిద్ధుడయ్యె ॥ 1

ఆతడమరవిద్యాశాలకై యనువగు
కట్టడము గొని, మైసూరు పట్టణమున,
భక్తి రాజేంద్ర గురుని కైవసమొనర్చె
ప్రజనుతింప, నాతని గురుభక్తి మెరసె ॥ 2

ఆత్మసంపద ధర్మ కార్యముల వెలుగ,
క్యాతహాళ్ళిలో కట్టించె, ఘన మఠంబు
దాని నడిపింప నాచార్య దక్షునొకని
కోరి, పట్టపు శివరాత్రి గురుని చేరె ॥ 3

మంత్ర మహాఋషి ఆజ్ఞకైమస్తకంబు
వంచ , సిద్ధ లింగయ్య భావంబెరింగి,
సతత పంచాక్షరీ మంత్రరతుడగు, గురు
డాత్మలో చూచె శివరాత్రి యప్పనంత ॥ 4

అయ్య ! నీ సిరుల్ సార్థకంబయ్యె నేడు,
క్యాత హాళ్ళి మఠాధ్యక్షుడై, మనశివ
రాత్రి యప్పయే యిక శివ ప్రభుగురుడగు
నంచు, గురుడు జపంబునందాత్మ చేర్చె ॥ 5

ఆటపాటల తోడునీడైన, అప్ప
యే శివ ప్రభుస్వామి గా నెదుట నిల్వ,
అప్ప రాజేంద్ర గురువులే కాత్మలైరి,
క్యాత హాళ్ళి సుత్తూరు నంధైక్యమయ్యె ॥ 6

పట్టద గురునికీ యిర్వురు బాహుయుగళి
యై శ్రమింప, పాదద్వందమై చరింప,
నేత్రయుగ్మమై కన, శివరాత్రి ధర్మ
మొకటియే నాల్గు పాదాల నుర్విగాచె ॥ 7

దినదినంబు పెరుగు దీన విద్యార్థుల,
గ్రాసవాసములకు, కాన్కలంద,
గ్రామ సీమలబడె, జ్ఞానాన్న దాసోహి,
లక్ష్య సిద్ధి గోరి రాజగురుడు ॥ 8

సేవ నాది, ఫలమునీది శివ !, యటంచు
గురుడు కార్యరతుడగుచు, తిరుగుచుండ,
పచ్చ పచ్చగ ప్రబలెడి పల్లెలందు,
కక్షలను చీడ పురుగులు గ్రమ్మ పెరిగె ॥ 9

కాయకష్టోపజీవులా, గ్రామ జనులు,
ధనము ధాన్యంబుకలిగెడి దాతలయ్యు,
ఆగ్రహోన్మత్తులై, సదా, నడలు చుండ్రి
విద్యయే యున్న, యీ వెతత్ విరుగుగాదె ! ॥ 10

ఈ యంతఃకలహంబుల
నీయెడబోకార్పకున్న, నేనేరీతిన్
యీ యూరున కాలూనట,
న్యాయాన్యాయముల, దీర్ప, నయమని గురుడున్ ॥ 11

ఊరి వెలుపల ఆలయ ద్వారమందు,
నిలచె, గ్రామస్థలీ స్థితి దెలిసి, యింక
చేయునదిలేక, గురువరున్ చేరి మ్రొక్కి,
రంత, సాదరోదారుడై అయ్య బలికె ॥ 12

రండు కూర్చొనుడీ శివాలయమునందు,
ఒక్కరొకరిని గ్రహియించుటొప్పుగాదె,
పెడ ముఖంబుల బెట్టిన ప్రేమకలదె ?
ప్రేమయే లేని సంపదకేమి ఫలము ? ॥ 13

ధన ధాన్య సంపదలమరు,
ననుపమ సిరివంతులయ్యు, నాత్మకు శాంతిన్
క్షణమేనియు గంటిరె ? పెం
చిన పగ, విషమగును గాని, సేమంబగునే ? ॥ 14

కలకల నవ్వు ముఖంబుల
కలకాలము కలసి మెలసి,జ్ఞానాన్వితులై
ఇల జీవించిన మీరు, స
ఫల మగు మాతపము లంత, పరశివుడలరున్ ॥ 15

నావు డెల్లరు ముక్తకంఠంబుతోడ,
స్వామి పాదాల సాక్షి మాస్పర్థలుడిగె,
అని, ఒకరొకరు తాంబూలమందుకొనిరి,
గురుని చర్యల శాంతి యెల్లరుకుదక్కె ॥ 16

అంత శ్రీమంత భక్తులత్యంతనిష్ఠ
స్వామివారికి పాదపూజలు సలుపుచు,
ప్రీతి ధనధాన్య, రాసులర్పించు కొనిరి,
గురుడు వారియింటింట దేవరగ నిలిచె ॥ 17

పిలువగదలచియు, కొందరు
బలముబలగము సిరిలేని బడుగుల మీ పా
కలలో బూదియు, లేదే
ఫలమాశించి, గురుడిటకు వచ్చునటంచున్ ॥ 18

చింతా క్రాంతవ్యక్తుల,
స్వాంతంబుల దెలిసి గురుడు, సంచలితుండై
అంతు నెరుంగని సంశయ
మంతంబొనరించి, వారి నలరించుటకై ॥ 19

తను, దా, వారిండ్లకు చని
మనసారగ మాటలాడ, మా దేవుడె వ
చ్చెనని, మహానందముతో
కనులంగడిగిరి గురువరు కమల పదంబుల్॥ 20

అంత నొక సాధ్వి దేవా!
సంతతి లేని యిది గొడ్డు జన్మ, యనంగాన్
చింతింపకు తల్లీ! శివు
చింతింపుము, నాతడిచ్చు శ్రీ సుతుననియెన్॥ 21

గురుడింకొక నిరుపేదన్
పరికింపగ, నతని యిల్లు ప్రచలితమై, బి
డ్డలతో కలగుట చూచుచు,
హర హర! యుష్మద్విలాస మద్భుతమనగాన్॥ 22

ఇంతలో గృహస్థుడేతెంచి, భక్తి సం
భ్రమములొలుక, సాగిలబడి, మ్రొక్కి,
చదువు సాములేక సంతతి వెత గూర్చె,
అయ్యగారె, వీరి నరయవలయు ॥ 23

ఏమి! బిడ్డల చదివింప నిచట తగిన
శాల సౌకర్యముల్ లేవె? సంకట పడ
కారణంబేమి? యంచు కన్నార సుతుల
చూచి, వారి భవిష్యత్తు తూచె గురుడు॥ 24

కూలి చిక్కినగాని, మాకు కడి లేదు,
చుట్టు పట్టుల బడిలేదు సుతుల బంప,
కడుపు నిండకు బిడ్డలే గలరు గాని,
కడుపు నింపెడి రేఖ యొక్కటియులేదు ॥ 25

అనగ దరిజేరి రాజేంద్రుడాదరమున,
పలికె చింతింపకయ్య ! బిడ్డల నొసంగు
శివుడు, బిడ్డల గావడే ? చిన్నవారు
నవ సమాజ సంస్థాపనాశివులుగారె ? ॥ 26

కాన యిటనె అత్యంత శీఘ్రముగ, నొక్క
బడి తెరువ బడు గాక, యీ ప్రజ వెలుంగు
గాక, ఆ పయిగురువను గ్రహమటంచు
వెడలి పోయె, నా రాజేంద్ర విశ్వగురుడు॥ 27

పూరి గుడిసెల దాటి, మున్ముందుకేగ
భక్తుడొక్కడు చనుదెంచి, పదములంటి,
మ్రొక్కి, లేచి, నమ్రుడయి, కేల్మోడ్చి, శిరము
వంచి శివ ! గూటికేతేర వలయుననగ ॥ 28

కనులు చెమరించె స్వామికి, కరిగె మనసు,
ఔర ! దాసోహమందు సాక్షాత్కరించె
శివుడని తలిరు తోరణాల్ చెలగు చుండ
అలికి ముగ్గులు పెట్టు ముంగలిని చూచె ॥ 29

చూచి, ముందుకేగ, సుగంధ శోభితసుమ
భరిత సాంబ్రాణి ధూమంబు, ద్వారము కడ
స్వాగతంబిచ్చె, లోనికి స్వామి వచ్చి
అతి నిరాడంబర స్థానమధివశించె ॥ 30

ఆత్మ లు నమచ్ఛివాయ మంత్రాక్షరముల,
ఆత్మ ముట్ట భక్తుండు, భార్యా కుమార
సహితుడై, శివరాత్రి రాజగురుపాద
పూజ సేయుచు, తీర్థంబు పుచ్చుకొనియె ॥ 31

ఉతికిన మడుగు దోవతులొప్పుచుండ,
భస్మరేఖలాత్మ ప్రభావంబు దెలుప,
వినయ వినమిత గాత్రుడై పిన్నవాని
తేరి పారగ చూచె, సుత్తూరు గురుడు ॥ 32

ఆదిమ శివరాత్రి గురుని ఆత్మ దలచి,
అంత నంతఃకరణబోధితాత్ముడగుచు,
అన్న ! యీ చిన్న వాని యధ్యయన మెంత
వఱకు వచ్చెనోయన, బల్కె వాని తండ్రి ॥ 33

స్వామి ! వీని విద్యాశ్రమంబేమి చెప్ప
వీడు ప్రాథమికోన్నత విద్యగరిచె,
కాని గ్రాస వాసంబులు కష్టమగుట
పెద్దనగరాన విద్య ప్రాపింప దనగ ॥ 34

విద్యార్థుల కుచితంబగు,
ఖాద్యోచిత వసతి గృహము కల, మాదరి కీ
విద్యాతురునిం బంపుము,
సద్యోజాత ప్రభావ సంస్కృతి గాంచున్ ॥ 35

భిక్షా పాత్రిక నిండెను,
శిక్షాలయములు సృజింప, శీఘ్రంబున ఆ
భిక్షానటుని యను గ్రహ
మక్షయమై వెలుగు గాక, అందరికిందున్ ॥ 36

అని, హూటాహూటి మైసూరి కరుగు దెంచి
ఆదిమశివరాత్రి గురుని ఆత్మ దలచి,
అవసరోచిత విద్యాలయాల, గురుడు
అచ్చుటచ్చుట స్థాపించె, అవని మెచ్చ ॥ 37

చామ రాజనగరమున జనులు తనకు
సాయమున్ జేయ, కట్టించె శాలనొకటి,
అటులనే పాఠశాల నత్యధిక రక్తి
గరళ పురిలోన నెలకొల్పె, గురువరుండు ॥ 38

పల్లె పల్లెల నీరీతి భక్తులిచ్చు
ధనము, ధాన్యంబు సేకొంచు, తద్బలమున
పాఠశాలల నడుపుచు, బాలురకు ప్ర
సాద నిలయముల్ కట్టించె, జనులు పొగడ ॥ 39

దినదినంబును రాజేంద్ర దేశికుని, య
శస్సు దిక్కుదిక్కుల దాకె, జ్ఞాన లతిక
లల్ల నల్ల విద్యార్థులందలము కొనగ,
జ్ఞాన విజ్ఞాన శిక్షలీ జగతి పెంచె ॥ 40

జనులనొకవైపు స్వాతంత్ర్య సమరమీడ్వ,
క్షామమొక వైపు దేశమున్ కాటువైచె,
పూటగడచుట కష్టమైపోవుచుండ,
గురుతరంబయ్యె బాధ్యత గురునికందు ॥ 41

తప్పని సరి ప్రభుత్వమున్ దరిసె, గురుడు
నిధులు సేకరింపగ, ప్రయత్నించె, రాజ
ధానిలో బడరాని బాధల నెదిర్చి,
కాని లక్ష్యంబు మఱువడీ కర్మ యోగి ॥ 42

గురుడు గుర్రపు బండిలో దిరిగి తిరిగి,
సంజదాక, వెన్నంటిన, సహచరులకు
ద్రవ్యమిచ్చుచు భోజనార్థంబు బంపి,
తాను "బేలీ" మఠమును తొందరిడ కుండ ॥ 43

స్నాన మొనరించి, శివపూజ సలిపి, కడకు
నీటినే ప్రసాదముగ నాపూట గడిపె,
తమకు భోజనంబెట్లని, తక్కిన సహ
చరులు ప్రశ్నింప, నాతడు చిరునగవున ॥ 44

కడుపు నిండకు నీరును గాంచకుండ,
కంట నెత్తురు గార్చెడి కడు దరిద్రు
లెందరో, యిట మలమల మ్రగ్గుచుండ
నాకు శివుడిచ్చు నీజీవనమమృతమనె ॥ 45

తమకై తామే సతతము
శ్రమించు, టీ జనుల కెల్ల సహజంబగు ధ
ర్మము, కానీ లోక హితా
ర్థమై శ్రమించు గురుని, వెత, తపమై పండున్ ॥ 46



అన్నమున శక్తి, శక్తితో అహము, నహమె
బ్రహ్మమై వెల్గ, జ్ఞాన మీ ప్రజ గడింప,
పూర్ణమౌ విద్య అవసరంబు, గురుడర్థి
నరసి, జ్ఞానాన్న దాసోహియై శ్రమించు ॥

# జ్ఞానాన్నదాసోహి

ఉర్విగురుడు జ్ఞానాన్న దాసోహి కాగ,
కరువు కాటకాల్ క్రమముగ కరిగిపోయె,
స్వామి కార్యగతిని ప్రభుత్వంబు తగిన
రీతి గుర్తించి, తోడ్పడె, పృథివి మెచ్చ ॥ 1

పేదలు శ్రీమంతులనెడి
భేదము, స్త్రీ పురుషులనెడి భేదము, నా నీ
భేదములణచెడి విద్య, ప్ర
సాదంబందరికి బంచు, సద్గురుడెపుడున్॥ 2

స్వామి సందర్శనార్థమై జనులు, దినది
నంబు వచ్చి తండోప తండంబులగుచు,
కొల్తు లెందరో కూటికై, గూటికై, కొ
లువునకై, విద్యకై, దయాలోలుగురుని ॥ 3

కన్నడ భాషా బలసం
పన్నుడు, "తా" శ్యామరావు, బ్రాహ్మణవరుడా
త్మోన్నత పదవీచ్యుతు, డా
పన్న భయావహుడయి, గురువర్యుని సేరెన్॥ 4

ఆ రాజేంద్ర గురుడు, మై
సూరు కులపతిగని, రావు సుగుణార్హతలన్,
సారగ, నాతడు సుముఖుం
డై, రక్షాకవచముగ, భయావహుకాచెన్ ॥ 5

అంత వెలుపల గల శరణార్థి నరసి,
నవ్వుచు గురుండు, మీకిట న్యాయమొదవె,
ఇంక నిర్భయముగ నింటి కేగవచ్చు
నన నతడు నేటికి గురువల నాత్మ కొలచు ॥ 6

అజ్ఞాత వ్యక్తులక్షే
మ జ్ఞుండై, పరితపించు మహితాత్ముడు, ధ
ర్మజ్ఞుండై, స్థానా స్థా
నజ్ఞతలెక్కింపడెపుడు, న్యాయమెచూచున్ ॥ 7

దినము గడచుటయే కష్టం,
బనాది విద్యార్థి, నే, మహమ్మదుకులజా
తుని, మీరే విద్యావం
తుని జేయవలెనని ఒకడు, దుఃఖంబుబుకన్ ॥ 8

కంట తడితోడ దూరాన కట్టెదుట, ని
లబడు పిన్న వానిని, శివరాత్రి గురుడు
చూచి, వీని కన్నీటిలో దోచె తపన
వీని వాలకంబున నిజంబేస్ఫురించె ॥ 9

ఏది నీయూరు, నిన్నెవ్వరిటకు బంపి
రనగ, వాడు బళ్ళారి నాదనిన, గురుడు
న్యాయ వాది "కో" చెన్న బసప్ప నీకు
తెలియునే యన, సంభ్రమ స్వాంతుడగుచు ॥ 10

వాడు కమ్మనొక్కటి దీసి భక్తి గురుని
కిచ్చె, నవ్వుచు నతడు వాక్రుచ్చె నల్ల
కులము కాదయ్య, విద్యకు, గుణము తపన
అవసరంబవియున్నచో నమరునెల్ల॥ 11

పొమ్మిదే, యీశ్వర ప్రసాదమ్ము గొనుము,
పట్టభద్రుండవై, యిక బ్రతుకుమనగ,
అయ్య! కన్నడ ప్రాచార్యుడరుగు దెంచె,
స్వామి దర్శనార్థమటంచు భటుడురాగ॥ 12

రమ్మనుమని, బల్కగురుడు బ్రాహ్మణ గురు
డరుగుదెంచి, గురుని పదంబంటి మ్రొక్క,
రాయరోహో ! యిందాక మీరాక లేమొ !
అనుచు, నుచిత సుఖాసనంబతని కీయ ॥ 13

స్వామీ ! నాదని యియ్యెడ
నేమున్నది, మీకు తెలియదే? యిటుచూడుం
డీ మాన ధనుని, ప్రతిభా
ధీమంతుని, కన్నడ కులతేజస్వి గుణున్ ॥ 14

పిన్న వాడయ్యు, గుణముల పెద్ద యితడు,
మూడు నాళ్ళు పస్తుండిన, మోము వంచి,
దేహి యనలేని విద్యార్థి ధీరుడితడు,
బూది గప్పిన యీనిప్పుబ్రోవుడనగ ॥ 15

అడగిన గుణముల నడగిన,
బుడుతనిముఖ వైఖరి గని, పొల్పగుకనులన్
వెడదయురంబున, సిరి క
న్నడ కవితా లత సుమ గుణంబుల జూచెన్ ॥ 16

పత్రికా ముఖంబీ, చిన్న వాని గంటి,
ఈతడు శివరుద్రుడు కదా ! యితని తండ్రి
ప్రాథమిక పాఠశాలలో వరగురుండు,
ఇతని గూర్చి బ్రాహ్మలు వచియింపవలెనె? ॥ 17

అనుచు చిరునవ్వుతో గురుండతని చూడ,
అతడు నాకు విద్యార్థులే యాత్మజు లిల,
వారలెల్ల జాత్యాతీత వర్గ జనులు,
వారికి గురుండననుచు తీవ్రముగ బలికె ॥ 18

శ్యామరాయరే, యేదొ హాస్యమున కంటి
కాని, మీగుణంబెరుగనే ? కాలయాప
న, మిక యేల ? మీ వాని కీనాటి నుండి,
ఆశ్రయంబగు నీ ప్రసాదాలయంబు ॥ 19

అనుచు కార్యార్థమై ముందుకరుగ గురుడు,
చిన్న వాడొక్కడేతెంచి, సిగ్గు పడుచు
వెతల, సత్యనారాయణ పేరు, పేద
వాడ, చదువుకై మైసూరు వచ్చితి నన ॥ 20

మంచిది, వెతలేల? మా ప్రసాద నిలయ
మందు సకలవసతులందుమనగ,
స్వామి! సంప్రదాయ బ్రాహ్మణకులమున
బుట్టినాడ, యిచట బోన మంద ॥ 21

నన్ను మావారు వెలివేతు రన్న, గురుడు
తేరి చూచుచు, సత్యమే తెలిపె, నితడు,
కులము విద్యకు నడ్డమై నిలువరాదు,
సంప్రదాయ విరుద్ధ మసాధువనుచు ॥ 22

ప్రక్కనున్న శరణులతో బలికె, యితని
కవసరోచిత సామగ్రి, అనుదినంబు
మనమఠము నుండి బంపింపుడనుచు, నాజ్ఞ
సేసి, వెలుపలికేతేరచిత్రముగను ॥ 23

దవ్వు దవ్వుల స్వామి సందర్శనార్థ
మై, అణగి బైల నిల్చు, దీనాత్ము చూచి,
ఎవడ వీవు ? ఏటికిటు కొట్టెండ నిల్చి
తనుచు, నాదరంబున గురుండడుగగానె ॥ 24

వాడచట నుండియే మ్రొక్కి, భక్తి తోడ
దేవ! చదువుపై ఆశనేతెంచి తిటకు
కాని గ్రాస వాసములకు కష్టమయ్యె
అంటరాని వాడననంగ అదిరిపడుచు ॥ 25

చదువుపై ఆశ గల్గ జిజ్ఞాసివగుదు,
కాని, అస్పృశ్యుడెట్లౌదు ? కంద !యీశ్వ
రాంశకలవాడె విద్యార్థి యగును, వారి
కీశ్వర ప్రసాదము సదాయిందు గలదు ॥ 26

గ్రాసవాసంబులే కాదు, కట్టుకొనగ
ఉడుపులితనికిండని, దరినున్న వారి
కాజ్ఞచేసి, గురుడు నిష్టమైన విద్య
ప్రీతి నభ్యసింపుమని, తా, వెడలిపోయె ॥ 27

ఆదివారాన విద్యార్థులందరికిని,
నూనె తోడ అభ్యంజన స్నానమునకు,
వేడి నీరు శీకాయి నిప్పింతురచట,
ఉచిత వసతి గృహాధ్యక్షులుల్ల మలర ॥ 28

ఆదిమ శివరాత్రి గురుని ఆత్మ దలచి,
వచ్చి, రాజేంద్ర గురుడు దివ్య ప్రసాద
మంది రంబున, నూరారు మంది చేరు
పండుగ దినాల విద్యార్థి పంక్తి నరసి ॥ 29

పాయసాది మధుర భక్ష్య, భోజ్యంబు, లం
దరికి పెట్టుచుండ, తా, గురుండు
నేతి పాత్రబట్టి, చేతులన్ నింపు, వి
ద్యార్థు లధిక భక్తి దన్నుచూడ ॥ 30

కడ పంక్తి దాక వడ్డిం
చెడి రాజేంద్రగురుడంత, చిత్తంబున, ని
ల్చెడి, గంగాధరుడిట, క
న్పడడే యన, ప్రక్క నున్న బాలుడు పలికెన్ ॥ 31

తనకేమో సరిలేదీ
దిన మన్నము ముట్టనంచు, తెలిపెననన్, త
క్షణమే గురుడా విద్యా
ర్థిని చూడ, వసతి గృహంబు దెస కేతెంచెన్॥ 32

నోరు తడియార, కనుల కెంపూర, బక్క
తనువుగడగడ వడకగ, త్రాణ తప్ప,
పెట్లుచున్నమే న్దాకుచు వెఱచి గురుడు
వైద్యుబిల్పించి, వెస చూప బాలునతడు ॥ 33

శ్రద్ధగా బరీక్షించి, జ్వరమ్ము తగ్గ,
మందు లిచ్చి గోధుమ గంజి, మాత్రమితని
కిప్పు, డావశ్యకంబని యెఱుక పరచి,
వెడలిపోవ, రాజేంద్రుడా యెడనె నిల్చె ॥ 34

ప్రక్కనున్న వారలు గురుని చూచి,
స్వామి, చిక్కనే చిక్కదు చక్కెర, రవ,
పూట పూటకు గంజి యీ బుడుతనికిట
కాచి యిచ్చుట, కష్టమీ కరువులోన ॥ 35

ఇప్పుడీ చిన్నవానిని యితని తల్లి
దండ్రుల కడకు బంపింపదగు ననంగ
చాలు చాలు మీ మాటలు సత్వరంబు
గంజి చేసి త్రాపించుటే కర్తమంచు ॥ 36

తనకు పట్టద గురుడు వాత్సల్యదృష్టి
బంపు చక్కెర రవమనంబందు తట్ట
వేగ గంజి సేయించి దెప్పించిగురుడు
అచటనే నిల్చి రోగి విద్యార్థి కిచ్చె ॥ 37

ఆతడే క్రమక్రమముగ న్యాయవాది
విద్యలందు ప్రవీణుడై, పేరు పొందె,
కడకు గంగాధరయ్య నాఖ్యాతి, రాజ
నీతి దక్షుడై గాంచె ధాత్రీతలమున ॥ 38

తల్లి దండ్రుల విడిచి విద్యార్థులగుచు,
తన్ను చేరిన యెందరో పిన్న వారి
కన్నమే గాదు, విద్యయే గాదు, వారి
ఆయురారోగ్య భాగ్యంబులతడు చూచు ॥ 39

ఈ మఠంబున చదివి, రాజేంద్ర కరుణ
కొందరాచార్యులై నిల్వ, కొందరు కుల
పతులు, మంత్రులు, వైద్యాధిపతులు, నగుచు
ప్రజల సేవించు చుండిరిప్పటికి కూడ ॥ 40

ఇచట చదివిన బలువురు ఎదిగి ఎదిగి,
దేశ దేశాల పేరు ప్రతిష్ట పొంది,
బ్రతికిరేగాని, చెడగరులైన వార
లెవరొ మచ్చునకైనకన్పింపరిందు ॥ 41

పేదవారికి, విద్యార్థి బృందమునకు,
స్త్రీ శిశు జరార్త వ్యాధుల సేవలుకని,
గురుడు వైద్యశాల నొకటి కూర్ప దలచి,
తగిన యేర్పాట్లు గావించె, తక్షణంబె ॥ 42

మతమునందొకనాడు, సంభాషణాస
రస సరస్వతీ చతురుడై రాజగురుడు
కావులంగుట్టు చుండ "అంకప్ప" నామ
శరణుడాత్మీయుడొక్కడాశ్చర్యమంది ॥ 43

గురుదేవా ! ఏమిది, యెం
దరికో మృష్టాన్నమిచ్చి దనిపెడి, మీ మం
దిరమున యీకావులకున్
కొరవయ్యెనె ? బొంతలేల కో యన గురుడున్ ॥ 44

ఏ మంటివి అంకప్పా,
యీ మందిరము, లమృతాన్న గృహములఖిల వి
ద్యామహిమాలయముల్, సే
వా మందిరము, లివి ప్రజల భాగ్యంబెపుడున్ ॥ 45

ఏనేగతి శ్రీమంతుడ ?
నే నొక ధర్మాధికారి, నిరతము శివ సే
వా నిరతుడ శివుడిచ్చుని
ధానము, శివుచేరు, దక్క దన్యుల కిందున్ ॥ 46

అన నా ప్రామాణ్యతకున్,
అనుపమ ధర్మాచరణకు, నా దాసోహం
బున, కా దృఢ చిత్తమునకు,
వణకుచు నాతండు గురుని పాదములంటెన్ ॥ 47

కరుణామయుడై, నిక్కపు
చరితుండై, నిజబలంబు చాటగ సముడై,
వరవిద్యాదానము వివి
ధ, రసజ్ఞులుకీర్తిసేయ, దనరె గురుండున్ ॥ 48

ప్రకృతి చిత్రవిచిత్ర సౌభాగ్యలక్ష్మి
దాని అందాన కలదు చైతన్య శక్తి
చేతనా శక్తి యంతయు శివ మటంచు
సృష్టి సౌందర్య జీవియౌ శివ తపశ్వి ॥

# హేమపుష్పార్చన

శివుని చైతన్య శక్తులీ సృష్టియందు
చిత్ర చిత్ర రూపముల భాసించు పెరిగి
హరుని లీలా విలాసంబు ననుభవించు
రసికులే ధన్య జీవులీ ప్రకృతి యందు ॥ 1

బెళ గిరిరంగన బెట్టన
వెలసిన సంపంగి వృక్ష విభవంబరయన్
తలచి గురుడు శివరాత్రికి
వలచిన సహచరులతోడ పయనంబయ్యెన్ ॥ 2

చంచలాత్మలైన, చంచరీ కాంగనల్
దరికి చేర లేక పరితపింప
యతి, సుగంధ సుమభరితమైన సంపంగి
వృక్ష విభవ మెరిగి యక్షయుడగు ॥ 3

అంత గురుని సుజ్ఞానమత్యద్భుతముగ
చీకటుల చీల్చి ముందుకు చేర్చుననగ
కారు మిన్కు మిన్కున దీప కాంతి మెరయ
ఒక్క దొర యింటి ముంగిట చక్క నిలచె ॥ 4

ఎవ్వరని యింటిలో నుండియేగుదెంచి
ఒక్కడా కారులో నున్న యుజ్వలాంగు
కావి బట్టలు గట్టిన ఘనుని గాంచి
భక్తితో సంభ్రమమున నిల్వ గని గురుడు ॥ 5

అయ్య ! కొండపైనున్న పుణ్య పురుషుండ
వీవు కలదొక్క సంపంగి వృక్షమిందు
రాత్రి గడపగ వచ్చి నారమొక దీప
మిచ్చి మాకు సహకరింపుడిప్పుడనగ ॥ 6

చకితనేత్రుడై, ఆ దొర ! స్వామి ! కడకు
కాలిబాటయు నిట నుండి గాంచమటకు
ఉరిమెమబ్బులు వర్షంబుకురియనుండె
క్రూర సత్త్వముల్ రాత్రుల క్రుమ్మరునిట ॥ 7

నాకు చూడగ మీ పయన, మిపుడంత
మంచిదనిపింపదన విని, మందహాస
సుందర వదనుడై స్వామి, చూచి దొరను
దీపమున్న శివుడు మము దేర్చునన ॥ 8

అతడు మరు మాటలుడిగి, గృహంబు సొచ్చి,
ఉజ్వల ప్రభా దీపంబు నొకటి దెచ్చి,
భటుని కందించి, యీ ప్రభల్ పదము చూపు
కాని, జాగ్రత్తగాముందు కదల వలయు ॥ 9

స్వామి! యిటనుండి మీరలీ శాన్య దిశకు
కొంత దూరంబుమున్ముందుకు చన, క్రిక్క
రించి, ఆకాశమంటెడి, వృక్షరాజి
భార్గవీనదీధ్వానము, స్పష్టమగును ॥ 10

సంచరించు మదగజాల సవ్వడి విన
వచ్చు, వివిధ పుష్పంబుల పరిమళంబు
విందు గూర్చునే గాని, కన్పింప విపుడు
వాటి బొడ్డున గలదు సంపంగి చెట్టు ॥ 11

తత్ప్రదేశము, రుద్ర సౌందర్య నిలయ
ము, సుమనోనురక్తుల సుభాంభోధి కాని
రాత్రులలం జూడగకడుదుర్లభమటంచు
ఆ దొర సెలవుగైకొన, అంతవారు ॥ 12

కారుదిగి, ముందు ముందుకు కదల, శకట
వాహకుడు దీప కాంతుల పథము చూప,
నిశనడచు చుండి రీ శాన్యదిశకు, గురుడు
ప్రణవ పంచాక్షరిన్ మనంబునజపింప ॥ 13

చదల గ్రమ్మిన మబ్బుల చెదరి పోయె
విరులరీతి తారా తతి విచ్చి మెరసె
రాత్రి పుష్పంబులాత్మ సౌరభముచింద
స్వాగతంబిచ్చె వారికి చల్లగాలి ॥ 14

ఉన్నదున్నట్టుగా నిల్చె ఒడలువశము
దప్పె మోమున నిండె స్వేదంబు కాని
చేత బట్టిన దీపంబు చెదర నీక
వడకు భటుని చూచి గురుండు వచ్చె ముందు ॥ 15

నడుము లెత్తునిల్చిన మహానాగమొకటి
పడగ విప్పుచు కాంతులు పైకి చల్ల
గురుడు నాగమున్ నాగంబు గురుని చూడ
అదియు మార్గమధ్యమున చోద్యముగ తొలగె ॥ 16

గులకరాలముండ్ల మొలకలు లేనట్టి
పదిలపు పథమొకటి పాప రేడు
చూప వచ్చినటుల చూపట్టె నౌర! మ
హాత్ముల ప్రభావమరయ లేము ॥ 17

పోయి పోయి తుదకు పొదరింట చలువరా
పలకనొకటి చూడవారు పరిస
రాంతర ప్రదేశ మలరింప నిది తమ
ధ్యాన పీఠమంచు దలచిరంత ॥ 18

గురుడు రాతి పలక కూర్చొన కలకల
ధ్వని అటనట చెవులదాక ఆత
డాకడమెడనెత్తి నరయతటాలున
ప్రిదిలెవిరులు లింగ పేటి పైన ॥ 19

అద్భుతంబని దీపంబునండజేర్ప
కాన వచ్చె సంపంగి వృక్షంబు దాని
కలుగులోన జ్యోతిర్లింగ కాంతి యొకటి
కనుల మిరుమిట్లు గొలుపుచు మనసుదాక ॥ 20

విద్యుదైస్కాంత కాంతులు విచ్చినటుల
వెలువడు ప్రభల్ రాజేంద్ర కలిత యిష్ట
లింగమందున్న దున్నట్టు లీనమయ్యె
గురుడు రాజతేజస్వియై మెరయ సాగె ॥ 21

కనులుగాన్ వారి చెవులు భార్గవ తరంగ
శీకర తుషారకణములు సోకు చుండ
లెక్క పెట్టక నదియందు రేయినడుమ
సహచరాళితో స్నానంబు సలిపె గురుడు ॥ 22

భార్గవీ తటిన్ హేమ పుష్పార్చితమగు
శిలలు స్నిగ్ధలింగంబులైకళలు గ్రక్కు
టరసి శరణులు చకితాత్ములైరి గురుడు
ప్రకృతి పరిణమిత పరమేశ్వరి యటంచు ॥ 23

ఇచ్చవచ్చినకడయెల్లరు నిష్టలిం
గార్చనా పరవశులై మునిగిరి
వారలా ప్రశాంత వాతావరణమందు
దేశకాలగతులదెలియరైరి ॥ 24

ఎంత కాల మట్లుండిరో యెవరికెఱుక
కరుల ఘీంకృతిగాలులన్ గదప పక్షు
ల కల కలనాదముల్ దాక శ్రవణయుగళి
సూర్యభగవానుడే వారిజూడ వచ్చె ॥ 25

వారు మేల్కాంచి నిర్మల ప్రకృతి గనిరి
కాని రాజేంద్ర గురుడు లింగార్చ నార
తిన్ నిమీలతాక్షుడయి అతీంద్రయజ్ఞు
డై దెలిసె శివలీలా రహస్య సరణి ॥ 26

పరవశానంద భరితుడై గురుడు బలికె
దేవ! రూప నామక్రియా తీత తత్త్వ
మగుచు నిగ మాగమంబుల కందరాక
అందుచుందువు అందరికనుభవమున ॥ 27

ఎంత బలాఢ్యులకైనను
అంతునెరుంగని మహత్త్వమందు మహేశా ?
ఎంతటి ఖలునైనను అ
త్యంత దయన్ కాతువీ మహత్వంబెటులో ॥ 28

తరచి తరచి నీ యంతు నర్థంబుగాక
హరివిరించులే చకితులై కరము లెత్త
పురుగు పాము పులికరి పామరులు నమ్మి
నిన్ను నీలోన ఒకటి గా నిలుతు రెటులో ॥ 29

హాకిలిం గా చుకాటికాపరివొ! కన్ను
లొసగు ముక్కంటి దేవరవో! సమస్త
లోకములనేలు కాలాగ్ని రుద్రుడవొ! ప
రాత్పరా! యెవ్వరని నిన్ను ప్రణుతి సేతు ॥ 30

జలపాతంబుల దాగిన
వెలుగులకున్, చిగురు పొదల వినిపించెడి కో
కిల కంఠంబులకున్, కు
ట్మలవిభవంబులకెవండు మహిమలగూర్చెన్ ॥ 31

పూలలో రంగులెవ్వడు పులుము చుండె
సూర్యచంద్రులవెలిగించు జోతి యెవడు
చిత్ర చిత్ర భంగిమముల సృష్టి నెవడు
త్రిప్పునోయనిగిరినల్ల తేరి జూచె ॥ 32

కనుల మెరపించు శిఖరాభ్రకాంతిరేఖ
తనువు పులకింప పచ్చ పచ్చని కటకము
లాత్మ నలరించు నీ చంచలాత్మయైన
ప్రకృతి నీ దివ్యశక్తియై ప్రణుతి సేయు ॥ 33

వాక్కు నీ యంద బుట్టి నీ వైభవంబు
పొగడ జాలక స్తబ్దమై పోవనదియె
సచ్చిదానంద శరదిందు చంద్రికల్ ధ
రించు పూర్ణుడౌ నిన్ను తలంచు టెటులొ ॥ 34

కొండపై నుండి దిగుచున్న గురుడు మబ్బు
టిరులతొలచుచు గాలి తుంపరుల గడచి
స్థూల సూక్ష్మ దృశ్య పుటింద్రజాల మడచి
సహచరాళితో చేరె స్వస్థానమునకు ॥ 35



శివునిచిద్విలాసము గని సృష్టినెల్ల
తరచి తన్మయుండగు జగద్గురుడు జగతి
స్నేహగతి భూతకోటికి జీవమిచ్చి
వేవెలుంగుల సతతంబువెలుగుచుండు ||

# జగద్గురువు

బెంగళూరికి చేరువ వినుతి కెక్కు
సిద్ధగిరిచూడ కోర్కులు సిద్ధిపొందు
అదియునరుల కళ్యాణనందమందసేయు
దాని వీక్షింప గురుడు డెందమున దలచె ॥ 1

పోవ నుండ భక్తుడొకడు బుద్ధి! మనకు
అశనమాకొండలందెట్టులమరుననుచు
మెల్ల గొణగగ రాజేంద్రుడల్ల నవ్వి
ఇట ప్రసాదమిచ్చెడి శివుండటనొసగడె? ॥ 2

అనిగిరిదరిచేరగ కొందరయ్యలచట
నడ్డుపడి కారు నిలుపుచు నమిత భక్తి
నేడు శివరాత్రి శరణులతోడు లేక
ఆరగించుట మా క నాచారమిందు ॥ 3

ఈశ్వర ప్రసాదంబు గ్రహించి మము కృ
తార్థులంజేయ భూమిపై నవతరించు
పరమ మాహేశ్వరాచార పరులు మీర
లంచు నుతియించు వారలంగాంచి గురుడు ॥ 4

కారులోనున్న భక్తుల కలయజూచి
తమయభీష్టంబు నెరవేరె తడవు తగదు
దిగుడటంచు భక్తాళిపై దృష్టినిలుప,
భక్తులటదిగి అయ్యలపజ్జ సేర ॥ 5

వారలంజూచి రాజేంద్ర పరమ గురుడు
మీరు శివుని ప్రసాదంబు నారగింపు
డింతలో మేము జనుదెంతు మిచ్చటకని
కారుతో కొండపై చేరె క్షణములోనె ॥ 6

దిగి వెనుక వచ్చు భక్తులతేరి జూచి
శరణులాధిత్యమీయ సంబరమున నట
అరటి యాకుల బరచుచు నధిక శ్రద్ధ
సిద్ధమయ్య ప్రసాదంబు సేకొనవలె ॥ 7

అనగ యిష్టలింగార్చనంబాచరించి
వచ్చి, ఆకుల నీర్జల్లి పైన దుడిచి,
భక్తతతినోట నీరూర, పాయసాది
ఇష్టమృష్టాన్న కలన వడ్డించిరంత ॥ 8

వేడి కొబ్బరి పోళీల వేగనిడుచు,
వెన్న గాచిన నేయి, వెన్వెంట పాలు,
దొప్పలంబోసి, ఆకుల తుదినిలుపుచు,
జంకు గొంకుల తగదు భోజనపు వేళ ॥ 9

ఎవ్వరెన్ని పోళీలు భుజింప గలరొ
వారికన్ని రూప్యంబులు భక్తి తోడ
దక్షిణ నొసంగుటే మాకు ధర్మమంచు
శరణుడొక్కడెల్గెత్తి బిగ్గరగ చాటె ॥ 10

తట్టలో సుగంధ ద్రవ్య తాంబూలముల్,
శరణుడొకడు తెచ్చుటరసి, వారు
ఔర ! కారడవుల అమృతాన్న మిప్పించి,
గురుని మాట శివుడు తిరమొనర్చె ॥ 11

అంచునొక్కరొక్కరద్భుత స్వాంతులై
వారు భోజనంబులారగింప
గురునికారు సిద్ధగిరి చూచె భక్తుడు
కోరినటుల శివుడు కోర్కులొసగు ॥ 12

ఒక్కనాడు బెంగళూరికి గురుమూర్తి
పోవుచుండ, శకటముచెడ దారి
పజ్జనున్న పేదవాని గృహోపరి
భాగమందు తిన్నెపైకి చేర॥ 13

చుట్టుపట్టుల గల పూల చెట్టులరయు
చుండ నాగృహస్తు గురుని చూచి చోద్య
మంది భక్తి సంభ్రమచకితాత్ముడగుచు
దేవుడేతన యింటికేతెంచె నంచు॥ 14

గురునిలోనికి గొనిపోయి కూరుచొనగ
ఒక్క ఆసనంబర్పించి ఓపరాని
బాధయెదచిమ్మ కన్నులు బాష్పధార
లెగయనాత "డో" యంచు నెల్గెత్తి ఏడ్చె॥ 15

సరివారలలో నే నిక
తిరుగగలేను తలయెత్తి దేవ! యీాపే
దరికంబెటువచ్చెనో ? ఎ
వ్వరికిన్ ద్రోహంబు దలప స్వప్నమునందున్॥ 16

చుట్టు నప్పులవాండ్రు నన్ జుట్టుచుండ్రి
ఏటికిటులైతి స్వామి? నాకేది దిక్కు
ఏమి సేయుదు నేనెటుకేగువాడ?
అనుచు వలవల వాపోవునతనిచూడ॥ 17

గురుడు నింతలో చాలకుండరుగుదెంచి
బుద్ధి ! మనబండి యిపుడు సంసిద్ధమయ్యె
అనగ శివరాత్రి రాజేంద్రుడడలు వాని
వెఱువకుము శుభంబగునంచు వెడలిపోయె॥ 18

మంత్రితోడ గురుడు మాటాడుగాని, ఆ
అపరిచితుని దుఃఖమాత్మనంటి
కలచివైవ, "కల్లకపటమే లేని, యీ
బ్రతుకు లెపుడు బాగుపడునొ" యంచు|| 19

ఆది గురుని తలచుచు పంచాక్షరిన్ జ
పించుచు, సెరగున విభూతి పెళ్ళకట్టి
పని ముగించి చాలకునితో, మనము ముందు
కారుచెడినయింటికడకె, చేరవలయు|| 20

పదమని గురుండు త్వరపెట్ట వాడు బండి
నడుపుకొనివచ్చి చెప్పిన కడ నిలుపగ
స్వామినిన్ చూచి ప్రాణముల్ వచ్చినటుల
వచ్చె పరుగుతో నాయింటి బడుగు పెద్ద|| 21

ఎదురెదురు చూచి మీ రాక కింత వఱకు
ఇప్పుడే లోనికేగితి యింతలోనె
స్వామి దర్శనంబగుట నాభాగ్యమనగ
"అయ్య యీ విభూతి ధరింపు మహరహంబు|| 22

ఈశ్వరానుగ్రహంబున నెల్లచక్క
బడు" నని విభూతి పెళ్ళను వానికిచ్చి
వ్యవధిలేదిట మాకు మాటాడ రమ్ము
మామఠంబున కని స్వామి మరలిపోయె|| 23

నెలతిరుగక ముందే అ
ప్పులబాధలడంగ నతడు పూగాన్కలతో
కొలచెన్ మైసూరునగురు
వరునిన్ గురుడు కరుణింప భాగ్యములరుదే ?|| 24

స్వామి ఔదార్యమున్ చూచి సహనముడిగి
కొందరు గొణగ లోలోన కొందరెదుట
బడియు మరుమాటలాడక ప్రక్కకేగ
ఒక్కడు తెగించి క్రోధము గ్రక్కుకొంచు ॥ 25

అన్నదానంబు పేరుతో నన్యులనిట
కొల్ల గొట్టెడి మీరును గురువులె ? మఠి
చదువుకై లక్షలంగుంజ స్వాములె? ఇట
కావి గట్టులోకజ్ఞులేజ్ఞానులంచు ॥ 26

పిచ్చిగ గురువరుని చెంత ప్రేల వాడు
క్రోధ ఘూర్ణితనేత్రులై గురుని శిష్యు
లతని భంజింపపైబడ ఆగ్రహించి
గురుడు వారల చూపులోదరిమివైచె ॥ 27

వాగి వాగి వాడు కడకుపలుకలేక
వచ్చినటుల సేమంబుతో వదలె మఠము
కాని "త్వరలోనె వీడు నిక్కంబెరుంగ
గలడని" గురుండు లోలోన కొలచె శివుని ॥ 28

క్యాతహాళ్ళి కుందూరు మఠాధిపతులు
శీఘ్రమేచెంత చేరి రాజేంద్రునేమి
ఏమియన చిరునవ్వుతో నేమిలేదు
మనల ప్రశ్నించు వారికి మాటలంచు ॥ 29

కొల్లబోయిన వారికి కొదవలేదు
చదువుకై ఉన్న వారిచ్చు సంపదలిట
లేని వారికి చదువు కల్పించుచుండె
కావిగట్టలోకజ్ఞుడే జ్ఞానియగును ॥ 30

చెంపగొట్టెడి వారికే చెంపచూపు
క్రీస్తు తల్లికి మించిన ప్రేమమూర్తి
ఆగ్రహించిన వారినే ఆదరించు
కారణికుడే నిజముగ జగద్గురుండు ॥ 31

ఆ మాటలు విని చేరెడి
స్వాములు పరివార జనము లాశ్చర్యముతో
స్వామిని లోలో బొగడుచు
ప్రేమించుచు, భక్తి గొలచిరెల్లరు ప్రీతిన్ ॥ 32

కనకని బ్రతుకును బండిం
చిన ఉడిపికి గురుడొక పరిచేరన్ స్మేరా
నను మురళీ మోహనమూ
ర్తిని గోపవధూకిశోరుతిలకింపగనే ॥ 33

కన్నులానంద బాష్పముల్ గ్రమ్ముచుండ
మనసునజ్ఞాత సౌందర్యమనుభవింప
ఆత్మ నిర్వికల్ప సమాధి నందుకొనగ
శివ ! శివా ! భవద్రూప మచింత్యమంచు ॥ 34

పులకించిన శివరాత్రీ
శుల "అజమారగురుండు" జూచుచు ప్రీతిన్
కలిసిరి యిరువురునయ్యెడ
కలుగదు భేదంబు భక్తి గలిగన చోటన్ ॥ 35

మీరన యెల్లరకున్ కడు
గౌరవ మిందున్న గుట్టు కరుణింపుడనన్
స్మేరాననుడై ఆ ద్వై
తారాధకునింగనుచు శివాద్వైతియనెన్ ॥ 36

అయ్యో గుట్టేమున్నది
యియ్యడ? గురుడైనవాడు నెల్లరనొకటే
నెయ్యంబున చూ చిదియే
అయ్యలలో మేరువగుచునందరదనుపున్॥ 37

ఈయనుభవామృత నుడుల హృదయమలర
మెచ్చె అజమార తీర్థుండు నిచ్చెననుప
మమగు గౌరవంబు గురుండు మది చెలంగె
చుట్టుపట్టుల వారలు చోద్యమంద॥ 38

చౌడదామపురికి ఒక్క శరణగృహామ
హోత్సవంబునకున్ పడగూరుక్యాత
హాళ్ళి గురువులు రాజేంద్రుననుసరింప
ఎదురు గాలుల కారునందేగుచుండ్రి ॥ 39

ప్రణవ పంచాక్షరీమంత్రపారగుడయి
మౌనమూర్తియై నిశ్చల జ్ఞానియగుచు
నాడు రాజేంద్ర గురుడు ధ్యానముననిల్వ
ఉన్నదున్నట్టలుల్లంబు నులికి పడయె ॥ 40

ఇంతలో బృహచ్ఛకటంబు నెదురుపడగ
చాలకుడుదాని దప్పింప సరగున నది
సేతువున్ దాకె స్వాములాసెజ్జనుండి
కుప్పగూలిరి క్రిందికి కుదురు దప్పి ॥ 41

వెనుకనుండి వేగంబుగ విరుచుకుపడ,
శకటమాకారు నొరసి, ధ్వంసంబు సేసె,
అల్పగాయంబులన్ బడి, అడలుచున్న
స్వాములిర్వురు రాజేంద్రవరుని దలచి ॥ 42

ఏ విపరీతంబో గురు
దేవునకున్, దెబ్బపైన దెబ్బ బలీయం
బై, విధివేచె, కటా యని
వే, వారలు వచ్చి గురుని వీక్షింపగనే ॥ 43

ప్రణవ మంత్రంబు నుచ్చై స్వరంబుతోడ
కంఠకుహరాన వెలుపడకానవచ్చు,
స్వామి మృత్యుంజయుండౌచు, పజ్జ నిలచి
గడగడవడంకు చాలకున్ కరుణజూచి ॥ 44

కలకాలము మము గొల్చిన
జ్వలితంబగుశకటమిటుల సమిసెన్, గానీ
చలితోజ్వలమూర్తిని, ని
న్నిల నిలిపిన ఆదిగురుని, నే ప్రార్థింతున్ ॥ 45

అని మృత్యుంజయుడై అట
కనుపించిన, రాజగురుని గాంచి, చకితులై
మనమానందము పొందగ,
సనుదెంచిరి, స్వాములెల్ల సంభ్రమపరులై ॥ 46

అంత శకటాంతరమున ప్రయాణమైరి,
వారు మౌనముద్రాంకిత స్వాంతులగుచు
స్వామి పంచాక్షరీ మంత్రపరతమునిగె
విధివిలాసంబు విధియు దప్పింపలేడు ॥ 47

ఒక్కసారి బొంబాయిలోనుజ్వలముగ,
భక్త బసవ జయంతియేర్పాటుకాగ,
వివిధ రాష్ట్ర శరణకోటి, వీరశైవ
గురుగణంబులు చేరిరి, కూర్మినచట ॥ 48

సభముగియగానె, గురువులుత్సాహభరితు
లై, తలచిరి గణేశ్వరాశ్రమము చూడ,
కాని, కొందరచటి స్వామి కడువిచిత్ర
మన్యులను గౌరవించుటే, అరయడనగ || 49

దరహసితవదనుడు రాజగురుడు పలికె,
ఆ ప్రశాంతయాశ్రమకళోద్యానమరసి
సృష్టిసౌందర్యమున్ గ్రోలి, శివ విలాస
మనుభవించు వారలకు మర్యాద లేల? || 50

మనమె, ఆగురువరు మన్నించి మర్యాద
సేయ, శుభము గాదె చింతలేల?
అంచు శివగురుండు నాశ్రమాభిముఖుడై
చనియె దక్కువారలనుసరింప || 51

శైత్యజలగుండముల మేను ఝల్లనంగ,
వేడినీటి బుగ్గలు కడువెచ్చ గూర్ప,
శీతలోష్ణగుండములు స్పర్శింపపోయి
గూర్చి, చర్మరోగంబుల కూల్చునంచు || 52

అచటి చిత్ర విచిత్ర దృశ్యముల కల్గు
నా ప్రశాంత పవిత్ర వాతావరణము
హృదయమలరింప చూచి, వజ్రేశ్వరీ ప్ర
భావమీ సృష్టియై సుఖప్రదము కూర్చె || 53

అంచు గురువులాయాశ్రమ ప్రాంగణమున
సంచరించుచు, ముందుకు సాగ నాశ్ర
మ విభుడమలముక్తానంద మాధవుండు
ధీరరాజేంద్ర గురువరుతేరిజూచె || 54

స్వాములెల్లర, కాతడాహ్వాన మిచ్చి,
ఆత్మపీఠమర్పించి, అత్యధిక రక్తి
రాగ రంజిత వస్త్రంబు రాజగురుని
గప్పె, ద్వైతమద్వైతమై యొప్పెనచట ॥ 55

ఔర! రాజేంద్రుడెంతటి యాత్మబలుడొ
అంత వినయ వినమిత సౌహార్ద్ర మూర్తి
అహమడంగ, రారాయని అభవుడాత్మ
చేర్చుననుటకీ దృశ్యమే చెప్పదగును ॥ 56

ఎవ్వరెవ్వరేయేరీతి యెదదలంప,
వారివారికాయారీతి చేరువగుచు,
మో[illegible]ప్రదయ్యె, ముక్తానందయోగియంచు,
[illegible]తి సేసిరి స్వాములా పట్టునందు ॥ 57



ఆరవిరిసిన వెన్నెల యగుతమసము
అమృత సంజీవినీ స్పర్శయగును మిత్తి,
సచ్చితానందమయమౌను సహజసృష్టి
పాండితీ ప్రభశారదా ప్రభల సోక ||

# పాండితీప్రభ

గౌరీ శంకరబుధు డే
తేరగమాహిష్మతీ ప్రదేశంబునకున్,
నీరధివలె యుప్పొంగుచు,
నారాజేంద్ర గురు హృదయమంబరమంటెన్॥ 1

ఎవనికై కాశి వఱకు తానేగె వెనుక,
ఆతడిపుడు కొట్టెదుట సాక్షాత్కరింప,
శరణకోటితో రాజేంద్ర గురుడు వచ్చి
స్వాగతంబిచ్చి, జంగమార్చన మొనర్చె ॥ 2

మానవాకృతిమెరయు, నుమామహేశ్వ
రుడవు, మీరు చూడని స్మృతి శ్రుతులులేవు,
సకల సమయాగమ రహస్యసారమెల్ల
రక్త కణముల తమకు జీర్ణంబునయ్యె ॥ 3

నాటి బసవాది శరణుల నాల్క పైన,
చిందులాడిన శివమూర్తి చిత్తమెరిగి,
ఉపనిషత్సారమాత్మలోనుదిలుకొనగ,
పలుక నేర్చిన జంగమ ప్రభుడవీవు ॥ 4

మామతమిపుడు పావనంబయ్యె, మీరు
రాగ, పరమ శాంతము పవిత్రంబు నగుచు
పుణ్యకపిలా నదీ తీర భూమి నిలువ,
అస్మదాచార్య వర్గమాహ్లాదమందు॥ 5

అనెడినుడులకు సంతృప్తినంది యతడు,
అన్న! కాయక వ్రతమున ఆత్మ నెరిగి
ఇహమున పరము పండించు మహిమనీది,
నీకు గల యాయనుభవము మాకు గలదె?॥ 6

పలుకుల సత్యము, కార్యం
బుల చైతన్యమ్ము, నాత్మ పూర్ణ సుఖంబున్
పులకింపగమీ బ్రతు క
న్యుల కాదర్శంబుగాదె ?, యుర్వీస్థలిపై ॥ 7

అప్పుటప్పుటికేర్పడు నడ్డులెల్ల,
ప్రతిఘటించుచు, నడచుచు, ప్రగతియందు,
ప్రజల తిద్దుచు, ప్రకృతి పోరాటమందు
నీలకంఠుని మెప్పించు, నియతిమీది ॥ 8

మావి చిల్కపల్కులు, సదామామనంబు
పూర్వగాథలు త్రవ్వగ బోవు గాని,
నిత్య నూతన సృష్టికి నెరవు మీరు,
జలద విద్యుత్తు భూమిపై నిలువదనగ॥ 9

మీ నుడుల నిరహంకారమే స్ఫురించె,
పూర్వుల మహత్త్వప్రభావంబు పూర్ణమగుచు,
భూమి నిగమాగమంబులై పొలయుచుండ
వాటి నిత్యర్థమున్ సేయు ప్రజ్ఞమీది ॥ 10

మీరు లేకున్న నాద్యుల మేమెఱుంగ
గలమె? వారలయనుభవజ్ఞానమెల్ల
తెల్లమగునె? తమస్సునతెరవుచూపు
మెరపు భూమిపై బడ భూమి నిలువగలదె ?॥ 11

సంభ్రమాశ్చర్య సంతసస్వాంతమెగయ,
పండిత స్వామి మోమున పండ నవ్వు
కౌగిలింప రాజేంద్రుడజ్ఞాత సౌఖ్య
మందె, వారికీ జగతి అదృశ్యమయ్యె॥ 12

సంధ్యలో, న ఘమర్షణ స్నానమాచ
రించి, లింగార్చనంబు ముగించి, వే, ప్ర
సాదమున్ గొని, కార్యముల్ చక్కతిద్ది
తిరిగియెప్పుడో రాత్రికి గురుడు వచ్చు ॥ 13

కార్యభారంబునన్, నిజ కాయరక్ష
మరచి, రేబవళ్ళు శ్రమింప, గురువరుండు,
దినదినంబును ఆరోగ్యమణగుచుండు
చెరిగి శంకరస్వామి తావెఱుగు పడుచు ॥ 14

అన్న! కార్యంబులెన్నియుత్పన్నమైన
కాని, ప్రొద్దువాలకముందుగ శివపూజ
మఠమునన్ దీర్చుటే శుభంబగును నీవు,
వచ్చువరకు ప్రసాదమే బట్టననగ ॥ 15

నాటినుండియు సూర్యుండు మాటు పడక
ముందె, శీఘ్రంబుగా మఠంబునకు వచ్చు
గౌరి శంకర స్వామితో గలిసి గురుడు
ప్రీతితో బ్రసాదంబు సేవింప తొడగె ॥ 16

గవి మఠాధిపతిగ, గౌరిశంకర పతి
నగరు చూడదినదినంబు నతని
పాండితీ మహత్తు, బ్రసరించె కర్ణాట
శైవ మఠములందు, శార్వరి వలె ॥ 17

స్వామి ఆజాను బాహుడైవచ్చుచుండ,
ఫాలము విభూతి పట్టెల బరిమళింప,
చెవులు పసిడి రుద్రాక్షుల చవుకళింప,
గళము నిష్టలింగంబున కళలు గ్రక్కె ॥ 18

అంత జయ చామరాజేంద్రుడంబతోడ
వచ్చి, గౌరి శంకర పతి పదములంటి,
భక్తితో మ్రొక్కి, స్వామి పార్శ్వమున నిలువ,
చెప్పనివెతల్ కనుల్ చెప్ప శిరము వంచె ॥ 19

జనని పరితప్త చిత్తయై, " స్వామి వంశ
గౌరవంబెల్ల గంగలో గలిసె నేడు,
కోడలీరాజ్యలక్ష్మినివీడి, పుట్టి
నిల్లు జయపుర సర్కారుకేగె " ననగ ॥ 20

వెచ్చని నిట్టూర్పుల, మది
విచ్చిన భావంబు లెల్ల, వివరింపంగాన్
అచ్చట మది తొక్కులు పడు
సచ్చారిత్రుని గని, నృపజననివచించెన్ ॥ 21

కాలఝులు మీరో దే
వా! లో పాలోపముల నివారించుచు, శ్రే
యోలాభము గూర్చుచు, శి
ష్యాళి ని మము గావవలయునని ప్రార్థింపన్ ॥ 22

అమ్మా! కాలాధీనం
బిమ్మాయామయ జగంబు, నిదినేరికి సా
ధ్యమ్మగు జయింపగ, ఉపా
యమ్మున శివ పథము చూడ, యత్నింప వలెన్ ॥ 23

జరిగెడి దిటపై చెప్పెద,
వెఱువక నాలింపు డిల్లు విడి, కోడలుజై
పురికిన్ బోవుట, యీరా
జ్యరమా విభవంబడంగు సంజ్ఞలు దోచెన్ ॥ 24

ప్రాయమే రీతి బుద్బుద ప్రాయమగునొ!
రాజ్య మీ రీతి చంచల ప్రాయమగును,
కాన వయసున సంతతిగాంచినటుల,
సిరుల శాశ్వత పదమంద వలయు నృపుడు ॥ 25

వీరభోజ్యమై యొకనాడు వెలసి నట్టి
రాజ్యము, ప్రజా పూజ్యమై బ్రతుకు నింక,
అనగ రాజ ఋషుల వంశమున జనించు
నృపుడు ఋషి పదంబున సదా నిలువ దలచె ॥ 26

ద్వైతాద్వైత, విశిష్టా
ద్వైత పదంబుల వెలుంగు ధార్మిక సంస్థల్
భూతలమున శాశ్వతమౌ
భూతింగన, దాన ధర్మములతడొనర్చెన్॥ 27

అడిగిన వారికి లేదన,
కడుగకయే, బుధుల కగ్రహారాదుల్, తా
తడబడక చామరాజేం
ద్రుడు దానమొనర్చె, పండితులు కీర్తింపన్ ॥ 28

చామరాజేంద్రుడిచ్చిన స్థలమున జయ
చామ రాజేంద్రతాంత్రిక శాలనొకటి
నృపుని పేరిట, శివరాత్రి నృప గురుండు
స్థాపన మొనర్చె జగమెల్ల సంతసింప ॥ 29

మఱుగు పడకుండ ఆర్షధర్మంబు, ప్రజల
కవగతంబుగాన్, వేద శాస్త్రాది బహుపు
రాణ తతికి వ్రాయించె, మూలంబుతోడ .
కన్నడ వ్యాఖ్య, బుధజనఖ్యాతి నెగడ ॥ 30

కవి, గాయక, నట, విద్యా
ప్రవరులు కీర్తింప, వారి ప్రతిభాపాండి
త్య విశేషంబుల గుర్తిం
చి, వారి నలరించె, విభుడు చింతామణియై ॥ 31

మైమఱచి నృపుండాపాత మధురమైన
నాదమున్ బట్టి, తిరిగె, ఆనంద జగతి
నమరుడగునట్టు, లాలోచనామృతంబు
దవుల, సంగీత సాహిత్య తపసియయ్యె ॥ 32

చండముండుల తెగటార్చు జనని చరిత,
మాత్మ తలపోసి కీర్తించె, నక్షరాళి
రాగభావతాళంబులరంజిలంగ
ప్రభుడు వాగ్గేయ కారుడై వన్నెకెక్కె ॥ 33

ఇంతలో శివరాత్రి రాజేంద్రగురుడు
కపిల గట్టున కట్టించె కట్టడంబు,
అదియు పరమ ప్రశాంతమై అలర, గౌరి
శంకర స్వామి కి పవిత్ర సౌధమయ్యె ॥ 34

కోకిలమ్మల ఓంకార కూజితముల,
కపిల గట్టున శ్రీదేవి గజ్జెవించు
ఆప్రశాంతమందిర శుభాభ్యంతరమున,
స్వామి యిష్టలింగార్చనా ప్రభుత మెరసె ॥ 35



కష్టసుఖముల, రాత్రింబవళ్ళ, చావు
పుట్టువుల, దేశకాలాల, కట్టివైచి
ప్రాణకోటిని త్రిప్పుచు ప్రబలు విధిని
ధాతకైనను తప్పింప తరముకాదు ॥

# బలవద్విధి

ఒక శరద్రాత్రి, శరణుల యుపనిషద్వా
చో విలాసమునకు, స్వామి చోద్యమంది,
వ్యాఖ్యరచియించు, తరి, వినవచ్చె, బయల
నీరు నెవ్వరో చేదెడి నిస్వనంబు ॥ 1

ఎవ్వరీ నడిరేయిలో నిచ్చటనుచు,
తలుపు దీసి బావి కడచూపులు మరల్చ
జడలు ముడివడ, ముఖకాంతి చదలనంట,
ఒక్క వర్చస్వినీర్దేదుచుంట చూచె ॥ 2

స్నానమున్ముగించి, చలువల, వెసగట్టి,
గద్దుగెకడకేగి, కరము సాచి,
ఇష్టలింగపూజ నిచ్చ గావించుచు
ఆ సమాధినాతడైక్యమందె ॥ 3

గౌరి శంకర స్వామికి కనులు చెదరె
గుండె దడదడమని బిట్టుకొట్టుకొనియె
క్షణములో బాహ్య జగమట స్తబ్ధమయ్యె
ఎంత కాలమట్లుండెనో ఎరుగడతడు ॥ 4

ఆది శివరాత్రి గురుడె, ప్రత్యక్షమయ్యె
నన్నభావంబు మెరుపుగ నాత్మ మెరసె
ఓం నమో నమః పరశివా ! ఊర్ధ్వరేత !
అంచుకేల్మోడ్చి గురునిస్తుతించెనతడు ॥ 5

పట్టపు శివరాత్రిగురుడు శ్వాసకోశ
రోగ పీడితుడై, జరారూఢి మిగుల
నలిగె, రాజేంద్ర గురుని మనంబు వెతల
చిక్కె, శంకర స్వామియుచింతమునిగె ॥ 6

లిఖితయోగ్యమౌ పొత్తముల్, రెండు మూడు
వేగ తెప్పించి, ఆ భవరోగ వైద్యు
పుష్టివర్ధను, మృత్యునిర్మూలుని, అమృ
తాంశుధరు, నాత్మలో నిల్పి అధిక భక్తి ॥ 7

నంది, మందాకినీ, శివానందులావ
శిష్ట యక్షేశు, లక్షరశీర్షులగుచు,
ముందునిల్వ పంచాక్షరీ ప్రోక్తమైన
ప్రణవమాత్మ గుహన్ ప్రతిధ్వనులు రేప ॥ 8

ఆ సరస్వతీ శక్తి తన్నావహింప,
పొత్తపుమొదటి పుటలోన పొందు పరచి
ప్రణవ పంచాక్షరీ మంత్రరాజమతడు
సొలుగా వ్రాసె ఐదు పుస్తకములందు ॥ 9

ఐదు పొత్తముల్ రాజేంద్రుడందనిచ్చి
అయ్య యిట వ్రాయ బడినట్టు లైదు పుస్త
కముల పూర్తి యీ మంత్ర రాజమును నింప
గురుని ఆరోగ్యభాగ్యంబు కుదురుననగ ॥ 10

ఐదు పొత్తముల్ రాజేంద్రుడంది, భక్తి
పట్టపు గురుని ముందిడ, శ్వాసబాధ
నదిమి, పూని కష్టంబున మొదట పుటను
చూడ, దివ్యానుభూతిలో చొక్కెనతడు ॥ 11

ఆంతరంగిక శక్తితన్నావహింప,
ముందు, నంది, మందాకినీ, సుందరేశ,
వరవశిష్టయక్షేశులందరును, నిల్వ
అర్థమాకృతి గొన శబ్దమడిగిపోయె॥ 12

ప్రణవ పంచాక్షరిన్ వ్రాయ ప్రతిదినంబు,
అక్షరక్షరంబున నూతనామృత కళ
లంతకంతకూరి, మనసునలముకొనగ,
అతని కలచునాది వ్యాధు లణగి పోయె|| 13

తనువు జీవంతమగుచు, బాధలకతీత
మైనిలచె, మది ఉత్సాహ మందుకొనగ,
నిర్వికల్ప దీపకళికానిభృతి వెలిగె,
మంత్ర మఖిలార్థ సాధనంబగుటనిజము || 14

గౌరి శంకర స్వామికి, కడుపు శూల
పుట్టె, యెన్ని మందులతండు పుచ్చుకొనిన
గుణము కన్పింపదయ్యె, సద్గురుడు చేరె
చెంతకున్, కడు ఉద్విగ్న చిత్తుడగుచు || 15

అంతకంతకతిశయించె వ్యాధి, బుధుడు
భూమిపై నిల్వ కటునిటు పొరలు చుండె,
అతని బాధ చూచియు, నిస్సహాయుడగుచు,
కనుల నీర్గ్రమ్మ, ముందును గాంచలేక|| 16

మందులేదొ! మంత్రంబుల మాన్పరాదొ!
అనెడి రాజేంద్ర గురుమాటలాలకించి,
అంత బాధలో కూడ మాటాడె, సామి
వ్యాధి కేమందు ఆయుస్సు నడ్డుగొనదు || 17

వ్యాధి రూపాన మృత్యువు వచ్చెనాకు,
నా శరీరమవని చేరు, నాకు హరుని
సన్నిధి సమకూరు, శుభ సమయమయ్యె!
మరణమే మహర్ణవమిగా నెఱుగ వలదె ?|| 18

అప మృత్యువునకు మంత్రం
బుప యుక్తంబగును, వ్యాధి నుడిగించుటకై
విపులంబగు నౌషదముల
నుపయోగమొనర్చు, వైద్యుడుచితజ్ఞుండై॥ 19

కంట తడిబెట్టు కాలంబుకాదు మనకు,
పురుటి నొప్పులు పొలతికి పుట్టినటుల,
మరణ వేదన జీవులందరికి గలదు
కాన సన్యాసి యీ పట్ల కలత పడడు ॥ 20

చంద్రుడుదయింప నుప్పొంగు జలధి, కాని
చంద్రు కబళించు రాహువున్ సంద్ర మడ్డు
కొన దుదధి మ్రింగు ముని, నెదుర్కొనడు శశియు,
చెడిన వారికి చెలిలేడు, శివుడు దప్ప ॥ 21

ఈ పల్కు వినవె ! యన విన
నోపక గురుడున్, ప్రయత్న ముండెడి దాకన్
ఏ పురుషుండును విడరా
దా పై, సర్వంబు నీశ్వరాధీనంబౌ ॥ 22

అని రాజేంద్రుడు, వేలూ
రున గల వైద్యాలయంబు, రోగుల కత్యా
ధునిక చికిత్సా రక్షణ
మొనరించుటలో బ్రసిద్ధి పొందె, నటంచున్ ॥ 23

గౌరీ శంకరునిన్, వే
లూరికి బంపించి, చూప ఉన్నత వైద్యుల్
చేరి పరీక్షించిరి కా
నీ, రోగము ముదిరె నందె నీల్గెనతండున్ ॥ 24

మెరుపై వచ్చిన వార్తయె,
శిరమున పిడుగై బడి గురుచిత్తముకలచెన్
పరిసరమదృస్యమయ్యె, శి
వరాత్రి గురుడున్న దున్నపట్టున కూలెన్॥ 25

శివరాత్రి యప్పవెంటనె
శివమంత్రము చెప్పుకొనుచు, శిశిరాంబువులున్
శివగురుపై చల్లగ, గురు
వివశత్వంబల్ల నల్ల విడివడతొడగెన్॥ 26

నిట్టూర్పులతో మేల్కొని,
కట్టెదుటన్ దుఃఖజలధి కవిసెడి జనులన్
బిట్టోదార్చెడి రీతిగ,
చుట్టుంగనె గురుడు, శిష్య శోకము లార్పన్॥ 27

క్రమ్మెడి దుఃఖమడచి, చి
త్తమ్మును వెస చిక్క బట్టి, దైనందిన కా
ర్యమ్ముల మఠము నడుపు యం
త్రమ్ముగ, గురుడౌర! వెతలణగు టెవ్వరికో!॥ 28

ఇష్టలింగార్చనా విధిన్, హృదయమెటులొ!
మంత్ర మహఋషిన్ దలచుచు, మౌని యగుచు
తాప్రసాదంబుగైకొను తరుణమందు,
ప్రక్కజూచి, కన్నీటితో పైకి లేచు॥ 29

మంత్ర సిద్ధి, పాండిత్యంబు, మధుర హృదయ
మన్నియు, శివైక్యమై బడుగయ్యె బ్రతుకు,
అంచు రాజేంద్రుడాత్మ చింతించుచుండె,
నిండుటెడద గౌరీ శంకరుండు నిలువ॥ 30

అణువులం గల మహచ్ఛక్తినంద వచ్చు
దేశ కాలాల మంత్రాన త్రిప్పవచ్చు,
కాని మిత్తినోటికి మేను కవళమగుట
తప్ప, దెంతవారలకైనతత్త్వమేమొ ॥ 31

గురుడు శయ్యపైఒక్కనాడెరగి, మగత
కన్నులరమోడ్చి నిద్రించు కాలమందు
గాలి కాంతి పుంజంబుగా గదియ కలసి
అదియు కడకు గౌరీశంకరాకృతిగొనె ॥ 32

గురుడు లేచి తటాలున కూర్చొన విన
వచ్చె జలదగంభీరమౌ వాక్యసరణి
ఇందునీయందనిల్చితి యేటికింత
బెంగ కాయకవ్రతమున వెలుగు మనుచు ॥ 33

దృశ్యమంతలోనంతనదృశ్యమయ్యె
గాలిలో శబ్దమలలగా గలిసిపోయె
కాని వాక్యార్థమాత్మలోనాకృతిగన
తన్నుతానెరిగి గురుడు తత్త్వమెరిగె ॥ 34

రూపువెల్గయ్యె ఆవెల్గుచూపలబడ
అల్లనల్లన తనలోన ఐక్యమంద
అంత శివరాత్రి రాజేంద్రుడద్భుతముగ
కార్యదీక్షచైతన్య సంకలితుడయ్యె ॥ 35

నాటినుండియు జ్ఞాన విజ్ఞానదీప్తి
వివిధ సంస్థల వెల్గ స్థాపింపతొడగె
ఆర్షధర్మసంరక్షణార్థంబు గురుడు
ఆశ్రమ మొకటి నిర్మించె అవని మెచ్చ ॥ 36

శంకరస్వామి రీతిగా సాధుజనుల
నాశ్రితుల తీర్చి తిద్ది మఠాధిపతుల
సేయనందందు నెలకొల్పె చిట్టి చిట్టి
మఠములన్ శివాచార ధర్మంబుచాట ॥ 37

కూటికై కోటి విద్యలు కూడుటెరగి
మానవుల సంస్కరించి విజ్ఞాన పథము
నందునడిపింప అన్నమాద్యమగుసాధ
నంబుకాన తత్సాధనార్థంబుగురుడు ॥ 38

ఆధునికరీతులన్ శిక్షలభ్యసింప
అవసరంబని వివిధ విద్యాలయాల
స్థాపనమొనర్చె రాష్ట్ర విద్యార్థిజనుల
గాక పరుల నాకర్షించి గణుతి కాంచె ॥ 39

వైద్య కళాశాల బృహ
ద్వైద్యాగారంబు పట్ట భద్రప్రదమౌ
విద్యాలయమున్ శిక్షణ
విద్యాకేంద్రంబు తంత్ర విద్యాసంస్థల్ ॥ 40

సంగీత నాట్య శిక్షణ
రంగాగారంబును శివరాత్రి గురుండున్
ఇంగితమతియై సద్వ్యా
సంగమొనర్పగ జనులకు స్థాపించెనిటన్ ॥ 41

విచ్చె కనులు జగతిమెచ్చ విద్యాసంస్థ
లుభయ తారకముగనుర్వి వెలిగె
ఆత్మనలము తమసమణగార రాజేంద్రు
డవని దీపమయ్యెనందరికిని ॥ 42

రాజేంద్రగురుడు విద్యా
రాజీవభవుండని ధర ప్రణుతింపగ అ
వ్యాజకృపాకరమూర్తిగ
రాజిల్లె ప్రభుత్వమతని ప్రజ్ఞగణింపన్| 43

సత్యముకవచమై ఆహింసచురకత్తి
యై, మహోత్యాగమేవైష్ణవాస్త్రమగుచు,
తోడ్పడంగ గాంధీ మహాత్ముండుత్రుంచె
దాస్య శృంఖలాల్ ప్రజలు స్వాతంత్ర్యమంద || 44

అంతరాజమహారాజులంతరించు
కాలమిదియంచుమైసూరుపాలకుండు
ప్రజలకైశ్రమియించు నీ రాజగురుని
కిచ్చెగోగజశాలలు తృణమెగొంచు|| 45

కొన్న గోగజశాలలత్యున్నతముగ,
ప్రబల విద్యార్థులన్, ధేనువత్సములను
పెంచె, విబుధసింగముల పోషించె, చేర
దీసి, రాజేంద్రుడాశ్రమదీప్తి మెరసె || 46

స్త్రీలకు శిక్షగరపు, వి
ద్యాలయముల్, తగిన రీతి స్థాపించి, యశ
శ్రీలలరగ, వారల గుణ
శీలురగావించె గురుడు, చిరతరప్రజ్ఞన్|| 47

విద్యార్థులకనువగ, వే,
ఖాద్యవసతిమందిరములు కట్టించుచు, తా
సద్యస్స్ఫూర్తి మెరసె మహి
మోద్యమములమగ్నుడగుచు, నుర్వీగురుండున్|| 48

శివనాగాంబాప్రవరుల
ప్రవరోదరజనిత పుత్రరత్నంబునకున్,
శివరాత్రిమఠాధ్యక్షప
దవినీయగ, ఆదిగురుని దలపోసెమదిన్॥ 49

అంతకర్ణాట విశ్వవిద్యాలయమున,
కన్నడ సరస్వతి హృదయంగమము కాగ,
అతడుపాశించి, పట్టభద్రాక్యుడగుచు,
తిరిగిరాగ, నా రాజేంద్ర గురుడు మెచ్చె॥ 50

ఈ రాజేంద్రగురుని, ఆ
చారవ్యవహారవిధుల, సర్వమెరింగెన్,
సారాసారజ్ఞుడు, సుకు
మారకుమారగురుడు, జగమభినందింపన్॥ 51

ఎవ్వడాజానుబాహువై, ఎవ్వని వెడ
దయురమాధ్యాత్మ నిలయమై, నయనయుగళి
యోగశక్తులు దీపింప, నుజ్వలోన్న
తప్రమాణ దేహంబుతో, దనరువాని॥ 52

చిరుతవానివైరాగ్యంబు, శీల శమద
మాది సకల సద్గుణముల, నాత్మతరచి
ఉత్తరాధికారపదవి, యోగ్యతగ్ర
హించి, నతనికీదలచి రాజేంద్రుడంత॥ 53

శుభముహూర్తాన, సుత్తూరు చొచ్చి, నిర్మ
లకపిల్లానదిన్ స్నానంబులాడి, గురు ప
రంపరా సమాధులకడశ్రద్ధజేరి,
వారినత్యంత భక్తితో ప్రణుతిసేయ॥ 54

ఆదిగురు సమాధినర్చించి, మంగళ
హారతులొసగంగ, అచటనున్న
నంది పూలదండస్పందించె, ఫలమొండు
జారిపడగ, గురుడు సంతసించె || 55

అనుచరశ్రేష్టశిష్యుడత్యంతభక్తి,
గురులసన్నిధి రాజేంద్రుగురుని పదము
లంట, గురుని కరస్థసుమాక్షతాళి
శిష్యశిరముపైబడగ, నాశీర్వదించె || 56

ధాత్రి శివరాత్రిదేశికేంద్రగురుడనగ,
ఉత్తరాధికారిగ, నతండొప్పె, దీక్ష
కావులిచ్చి పంచాక్షరీ జ్ఞాన మంత్ర
రాజముపదేశమున్ సేయ, రాజగురుడు || 57



సృష్టిశక్తులెరుగ నుపాశించునరుడు,
నేడు నారాయణుండౌచు నిలువగలడొ
శివుని మరచి కాలాగ్నుల సృష్టితోడ
తానెదగ్గమైపోవునోదక్షునిగతి ॥

# విదేశయాత్ర

దేశవిదేశాంతర, భ
క్త్యాశేషజనాళి, మఠమహోమహిమంబున్,
శ్రీశివరాత్రిగురుని ఉప
దేశంబాలింప, నేగుదెంతురు ప్రీతిన్ ॥ 1

ఏతెంచిన భక్తులు, న
త్యాతురతన్కాన్కలిచ్చియారాధింపన్,
ప్రీతిజగద్గురుమహిమం
బీతలమున ప్రాకతొడగె, నెల్లరు మెచ్చన్ ॥ 2

పిన్నతనంబున మఠమున
ఉన్నత విద్యా ప్రసాదముభయముగొని, అ
త్యున్నత పదవుల, నిత్తరి
మిన్నగ దేశాంతరముల మెరసెడి భక్తుల్ ॥ 3

వచ్చి, రాజేంద్రగురుని సంభ్రమవినయవి
ధేయతాభక్తి మ్రొక్కి,.బుద్ధీ ! జగద్ధి
తంబగుసిరుల పాశ్చాత్యధరణి మెరసె,
వారు వైజ్ఞానిక తపఃప్రభావులరయ ॥ 4

ముక్కంటికంటిమంటల
నెక్కొన, పరమాణు విద్య నేర్చిన వారల్,
పెక్కు జగంబుల నొక్కట
గ్రక్కున, బరిమార్పగలరు, కందెరచుతృటిన్ ॥ 5

ముప్పునరికట్టి, మరణంబు పొందకుండ,
రోగ బాధలనెల్ల నిర్మూలనంబొ,
నర్ప, శాశ్వత స్థితికి మానవుని చేర్ప,
యత్నమొనరించుచుండిరి వ్యవధి లేక ॥ 6

అచటి శాస్త్రవేత్తలహరహంబు, ప్రకృతి
నడగు విపుల శక్తినాత్మదెలిసి,
వెలికి యీడ్చి, మహికి విందు సేయగ, గ్రహాం
తరములాక్రమించు, దక్షులనగ || 7

చిరునవ్వుల వెదజల్లుచు,
గురుని ముఖము వెలుగుచింద, కొలచెడివారిన్
గురుతరభక్తశ్రేణిన్,
పరికింపుచు, గురుడు బలికె పరిణత ఫణితిన్ || 8

జనన మరణంబులన్నవి
తనువును వెన్నంటివచ్చుధర్మములెరుగన్,
మనసన్నింటికి మూలము,
మనసును బంధింప, యోగమార్గము దొరకున్ || 9

మనసు యోగబలంబుననణగుగాని,
బుట్ట తెరచిన ఫణి లేచి, బుస్సుమనదె ?
సహజ శివయోగ శక్తుల జ్ఞానియైన
మనిషి ఫణి హారి భూషణంబైవెలుంగు || 10

మనసు జన్మకు మూలమైమరులు గొలుపు,
కాలమే మరణమునకు కారణంబు,
స్మరహరున్, కాలకాలుని, సాంబు, నాత్మ
దలచు శివయోగికీవెతల్ తగులవయ్య || 11

తత్త్వమట్లుండనిండు, కర్తవ్యనిరతు
లత్యధికసాహసోపేతు లఘటనఘట
నాసమర్థులు, సంపత్కరీసుఖోప
భోగులన్, మెచ్చదగువారిబుద్ధిశక్తి|| 12

తన్నుపొడిచెడి వారిపై దయను చూపి,
ఆత్మరుధిరాన, పాపుల నఘమడంచు,
కారణపురుషుడౌక్రీస్తు, ఘనత గ్రమ్మ
పాశ్చమాత్యుల జూచుట, భాగ్యమనగ ॥ 13

స్వామి "ఊ" యని, నంత పశ్చిమధర
స్వాగతంబిచ్చి సత్కరింపదె, ఘనముగ ?
స్వామి పూజాదికంబుల సర్వమచట,
సాగ, యత్నింతుమనివారు, సాగిలబడ ॥ 14

రాజేంద్రగురుని పలుకుల
నైజమెరిగి, యచటనున్ననయనాన్వితులున్
యోజించిరి, విశ్రాంతీ
వ్యాజంబుననైన, గురునికబ్బునటంచున్ ॥ 15

భిన్న భిన్న దేశంబుల, భిన్న భిన్న
సంస్కృతిన్ చాటు ప్రకృతి, యీశ్వర విలాస
మద్భుత మొనర్చునని, అప్పుడపుడు పలుకు
చుంట్రి, పరికింప మామనంబుబుకుచుండె ॥ 16

న్యాయవాది గంగాధరయ్య, మఠ ఉత్త
రాధికారియౌ దేశికేంద్ర గురుడున్, స
హచరుడౌ శివస్వామియు, చంద్రశేఖ
రయ్య, కుందూరు గురువులాయయ్యనరయ ॥ 17

స్వామి, వారి భావముల, తాత్పర్యమెరిగి,
అన్యదేశంబులంగల ఆత్మ భక్త
పరుల చూడ, కాంక్షించి, ప్రవాసమునకు
నవ్వుతో సమ్మతిన్ దెల్ప న్యాయవాది ॥ 18

అమెరిక, కెనడా, ఇంగ్లాండునందు ఉచ్చ
పదవులందున్న, ఆత్మీయభక్తతతికి,
గురుని శివరాత్రి రాజేంద్ర వరుని రాక,
ముందె దెలిపి, బొంబాయికి పోయిరెల్ల ॥ 19

కాని, శివరాత్రి రాజేంద్రమానసంబు
ఆదిమ శివరాత్రి గురుని అర్చసేసి,
అడుగడుగున, అవిరళ పంచాక్షరీ జ
పాభిరాముడై, నిశ్చల ధ్యానియయ్యె ॥ 20

అంత యీ వార్త విని, విమానాశ్రమమున,
కరుగుదెంచిరి, భక్తులత్యధిక సంఖ్య
పూలహారాల గంధమాగాలిగలియ
గురునికి శుభాశయముల వీడ్కోలునిచ్చె ॥ 21

వింతలున్ చూడ సహచరుల్ వేగిర పడ
రాత్రి బొంబై విమాన ఆశ్రయము విడచి
లండను విమాన ఆశ్రయ ప్రాంతమునకు
మరలె అంతర రాష్ట్ర విమాన మొకటి ॥ 22

దేశకాలాల తెలిసియు తెలియని గురు
డందు కదలుచు కదలక ఆత్మ నిలిపె
అంతలో విమానంబుగమ్యంబుసేరె
కందెరచి గురుడా సీమకాలుమోపె ॥ 23

స్వామి రాకకై వేచెడి భక్తుల హృద
యారవిందముల్ కన్నులై, స్వాగతంబు
బలుక పువ్వుల గురుపదంబులకు దారి
చూపనదిచూచు జనమెల్లచోద్యమందె ॥ 24

గురుని పెదవులందు చిరునవ్వు దళుకొత్త
చెంత చేరగ ప్రియ శిష్యులెల్ల
అంతు తెలియని అమృతానందవివశులై
ఆత్మ గురుని గొలిచి రధికభక్తి || 25

స్వామికి మహేశయోగి ఆశ్రమము విడిది
యయ్యె, స్నానాది జపముల కాప్రశాంత
నిలయమత్యంత యోగ్యమై వెలసె గురుడు
ఇష్టలింగార్చనారతిన్ ఇహముమఱచె|| 26

అన్యకృత్యంబు లెల్ల బోనడచి నాడు
భక్తులిష్టలింగార్చనా పరవశులయి
వచ్చి గురునికి మ్రొక్కి ఆపదములకడ
వినయ వినమితగాత్రులై వేడ్క నిలువ || 27

వారలన్ పరామర్శించి, వరుస గురుడు
ఒకరినొకరిని దీవించి, ఉల్లమంట
సాదరముగ బలికె, మీ ప్రసాద తనువు
లీ ప్రకృతి కనువౌచు, వర్ధిల్లుగాదె ? || 28

నిత్యమిష్టలింగార్చనా నిరతి మీరు
మీ విధులదీర్ప, కాలము, మీకు తగిన
రీతి తోడ్పడుచుండెనే ? వృత్తి వలన
ధర్మలోపంబురాదు కదా! తమకిట|| 29

శరణుల అనుభవామృత సారమాత్మ
మరువరుకదా! నడనుడుల మార్గమొకటి
యగునె ? జీవకారుణ్యంబుననుసరించి,
జంగమార్చన సాగునా ? స్వాంతమలర || 30

అన చేరు శిష్యులొకరొక
రిని చూచు కొనుచు, గురుని దరి, తలలు వంచన్,
కనుగొని, రాజేంద్రగురుడు,
ప్రణయోదారవచనాభిరాముండగుచున్॥ 31

బెదరగనేలయ్యా ఉ
న్నదియేదో పలుకరాదె ? నాకని గురుడున్
మృదు మధురస్మృతి వదనం
బుదయింపగ చూడ, భక్తులున్నత మతులై ॥ 32

ఉదయాస్తమానముల, పరు
వుదీయు మా బ్రతుకులం, దపూర్వ సుఖంబున్,
ఉదయించిన పర్వదినం
బిది, యీ మీ సన్నిధానమెంతని పొగడన్॥ 33

గురుదేవా। యేమని మీ
దరి మేము వచింప వలెనొ, తట్టుట లేదీ
ధర, భౌతిక భోగంబుల
కిరవై, యంత్రముల సేసె, నెల్లరమమ్మున్ ॥ 34

భరత భూమిలో బుట్టిన వారమయ్య,
అట బ్రతికెడి భాగ్యంబు, మా కబ్బదయ్యె
అటచరించెడి భిక్షువులందు కూడ,
ఆదిభిక్షువునే జూతురాజనంబు ॥ 35

పంచభూతాత్మకంబైన ప్రకృతి యెల్ల,
భరత ఖండంబున పరమేశ్వర గుణంబు
లంట, ఆజీవులు ప్రమథులైరి శౌర!
వారి భాగ్యమే భాగ్యము వసుధ పైన ॥ 36

అప్పుడప్పుడు మీ మూర్తి ఆత్మనిలచు
గాని, మిము గొల్చు భాగ్యంబు గాంచమిచట,
పెన్నిధులమాసిరులు గ్రుడ్లు పెట్టుగాని,
మమ్మునర్థించు వారలీ మహినిలేరు ॥ 37

ఇక జంగములన, మాకం
టికి కన్పింపరొాకరైన యీయెడ, పూజా
ధిక భాగ్యంబులకున్ నో
చుకొనని మాకింక శాంతి సుఖమెప్పటికో ॥ 38

శిశు సంరక్షణశాలలు,
విశేషముగ పుట్టె, పెరిగె వృద్ధాశ్రమముల్,
కృశియించె, మాతృరక్తియు
నశించె గురుభక్తి యిచట, నరయంత్రతతిన్ ॥ 39

ఈ హిరణ్య దైత్య పృథివీ స్థలంబున,
గాలి, నీరు, వెలుగు, కట్టు బడె, ప్ర
జాళికి జననమరణాటంకముల్ తగ్గె,
చిత్రమైన ముక్తి చిక్కెనిచట ॥ 40

వారివేదనా హృదయాల పారచూచి,
చకితుడై గురుమూర్తి, నిశ్చలితుడగుచు,
ఆది గురుని స్మరించుచు, నాత్మలోన,
కన్నులరమోడ్పుగడియలోగాంచె వెలుగు ॥ 41

రాజేంద్రగురుని వదనము
తేజోమయమై, సరస్వతీ వృతమై, అ
వ్యాజకృపారసభరితం
బై, జగదానందకరమునైశోభిల్లన్ ॥ 42

కనువిచ్చి చూచె, భక్తుల
మనముల వెతలడగ, సమరసానందం
బున బల్కె, గురుడు శిష్యుల
కనులే కర్ణంబులగుచు, గ్రక్కున గ్రోలన్ ॥ 43

శరణ సామ్రాజ్య వీరు, లీ సత్యలోక
సత్వ సంపన్నులై, శివశక్తి మెరయు,
మీరు నిర్గుణనిజనిర్వికారమార్గ
మందియు, తెలియకీరీతి, అడలుటరిది ! ॥ 44

భరతభూమిపై మీకున్న భక్తి సరియె,
కాని, ఆత్మలో గురుడు సాక్షాత్కరింప
లింగమూర్తులయ్యు, చెడని జంగమశివు
నెరుగకే, మట్టి మనుజుల తరచనేల ? ॥ 45

గురుడు సదసద్వివేకంబు, గురుని చూప
సాధనంబయ్యె లింగము, సాధ్యమందు
మనల నొరవెట్టు జగమె జంగమము, గాన
శరణుడీమూల తత్వంబు మఱువరాదు ॥ 46

స్థాణు మహిమిష్టలింగానసంతరింప,
శరణుడాత్మ శక్తివిభవోజ్వలత మెరయ,
నిత్య చైతన్యలక్ష్మికి నిలయమగుచు,
విశ్వకల్యాణమూర్తిగ, వెలుగుచుండు ॥ 47

ప్రళయావసానమందు, స
కలభువనావళియెటనడగారటనె, పునః
వెలుగంగ సృష్టిలింగ
స్థలమై తనరారుచుండు, తాత్విక దృష్టిన్ ॥ 48

గురులింగ జంగమములగ
హరుడేముమ్మూర్తులగుచు, నవని తిరుగ, తా
మరతంపరగాశరణులు,
చరాచర ధరన్ వెలసిరి, శంభు గుణములై॥ 49

ధాత్రి గురులింగ జంగమత్రయమె, పూజ
నీయమౌ, భస్మరుద్రాక్ష నిరతి, మంత్ర
జపము సాధనాత్రయమౌను, సత్ఫల ప్ర
దమగు పాదోదక ప్రసాద ద్వితయము॥ 50

తనువును జ్ఞానార్జనకై,
మనమున్నేకాగ్రతకయి, మరలించి సదా
ధనమీ జగతికి వెచ్చిం
చినచో, దాసోహ సిద్ధి జీవులకమరున్॥ 51

గురుడే జ్ఞానము, లింగం
బరయగ సాధనము, జగతి నంత్యస్థితిలో
నొరవెట్టు జంగమవరుడా
పరశివచైతన్యమంచు, భావింపవలెన్॥ 52

గురులింగజంగమత్రయి
కిరవై, తనుమన ధనంబు లెల్లను త్యాగై
కరతిం గన సత్యము, సుం
దరమై శివమగు తత్త్వ దర్శనమిదియే ॥ 53

అని శివ గురుడాత్మ వ్యా
ఖ్యనొనర్పగ, చెంత నున్న గంగాధరుడున్
వినయంబునలేచి, గురు ప
యనంబు కార్యక్రమంబు, నట సూచింపన్॥ 54

గురుని పెదవులలేనవ్వు మెరయ, కాయ
కవ్రత క్రియా యోగంబు కలసిరాగ,
బ్రతుకుడని, సహచరులతో పయనమగుచు
గగన యానంబున అమెరికాను చేరె || 55

అచట భక్తులందరు ఘన స్వాగతంబు
పలికి, గురునకొక ప్రశాంత నిలయ మేర్ప
రచిరి విడిదిగా, కొంత విశ్రాంతి నంది,
గురుడు స్నానార్థమై ముందుకు సనుచుండ || 56

అచ్చెరవు గూర్చు దృశ్యము
లిచ్చట గల వధిక సంఖ్య, యివి చూచుటకై
వచ్చితి, మీ శివ పూజలు
నిచ్చట గూడ తెగవయ్యె, నేమనవలెనో || 57

అని గొణగగ సహచరులున్
వినియు వినని రీతి గురుడు, విధికృత నిత్యా
ర్చనలన్ సర్వము నెరపె, శ
రణాళి వచ్చె, కుసుమాది ద్రవ్యంబులతోన్ || 58

పట్టుబట్టలు గప్పిన పైడి పళ్ళె
రంబుల గురుని మ్రోల, నర్పణము సేసి,
భక్తబృందంబుకేల్మోడ్చి, బాష్పకణము
లురల, పరవశానంద సంభరితులైరి || 59

సహచరులు నప్రమత్తత,
సహజభ్రాంతి త్యజించి, సాష్టాంగముగా
మహిసాగిల బడు, భక్త ని
వహంబుగని, రక్తి గురుడు ప్రశ్నించెనిటుల్ || 60

ఔర ! యెన్నాళ్ళకెన్నాళ్ళకందరనిట
మిమ్ము చూడగల్గితిని, సౌఖ్యమ్మె మీకు ?
ఈ సదాచారసంపత్తియే, జగచ్ఛ
భాంకరముగాని, వింత దృశ్యములు గావు ॥ 61

తన వారు తలలు వంచ, శ
రణాళి భక్తి ప్రపత్తి బ్రసరింపగ, యీ
దినము విదేశీ భారత
జనమొక, సాంస్కృతిక సభను, సమకూర్చెనిటన్ ॥ 62

మీయాశీర్వాదముతో,
నీ యెడ, ప్రారంభమైన యీ సభ, శ్రేయో
దాయకమై, మున్ముందుకు
పాయని సుఖశాంతులొసగు, ప్రజలందరికిన్ ॥ 63

కంట గ్రమ్మిన పొరలెల్ల కత్తిరించి,
లక్షలాది జనుల, పునర్వీక్షణ కు శ్ర
మించు వైద్యుడు మోడీ యేతెంచె నిటకు
మీ శుభాశీస్సులతనికి మేలనంగ ॥ 64

అరవిచ్చుకంటి మొగ్గల,
చిరునవ్వుల దంతకాంతి చిందగ, నొసటన్
పరిమళ భస్మంబు మెరయ,
గురుడున్ దిలకించె సభను కొనియాడ జనుల్ ॥ 65

రామకృష్ణనరేంద్ర గాంధీమహాత్మ
లైన్సటన్మహాశయుల మహాతపఃఫ
లముల నవయుగప్రజ్ఞగా ప్రబలు నేటి
నరుడు నారాయణుండగు తరుణ మిదియ ॥ 66

చేదుదాచి, సుధాంశుని శిరసు కెత్తి
కామునిన్ గాల్చి, ప్రేమకు కాయమిచ్చి,
విభవ మన్యులకిచ్చి, తా బిచ్చమెత్తు
సచ్చితానందమెల్లరశాంతిదనుపు|| 67

ప్రేమింపుము, నీ వారల
ప్రేమింపుము, నీదుపనుల ప్రేమింపుము, నీ
భూమండలమన్నా ని
ష్కామంబగు కర్మయోగ సారంబిదియే || 68

నేనూ నీవనుభేదము
లేనంతవఱకు, సుఖంబు ప్రీతి కలుగునీ
లో నిక్షిప్తంబగు నిధి
మానవ ధర్మమది వెలుగు, మహనీయంబై || 69

వైజ్ఞానిక ఆధ్యాత్మిక
ప్రజ్ఞా జ్ఞానంబులనెడి భ్రమ నడపగ, స
ర్వజ్ఞత వెల్గు సమన్వయ
మౌ జ్ఞానమె నరుడు పొందు, నాత్మజ్ఞుండై|| 70

ఈ చరాచరాత్మక జగంబెల్ల శక్తి
రూపమని, ముందె దెల్పినారుమనవారు
కాని నేటి శాస్త్రజ్ఞులు గాంచినారు
శివుడులేని శక్తియె జగచ్ఛిద్రకారి || 71

మనిషిలో శివాంశ మాయమయిన, శక్తి
రక్తజీవియగుచు ప్రజలమింగు,
నరుడు శివుని దెలియ నారాయణుండౌచు
మాతృమూర్తియగును మహినిగావ|| 72

ఈ మతమామత, మని మీ
రీ మానవ ధర్మమడచి, కృంగకుడయ్యా
భూమికి మతమేమున్నది ?
ప్రేమకు సరిహద్దుగలదె విశ్వస్థలిలోన్ ? ॥ 73

పుట్టుటలో, గిట్టుటలో
పుట్టని భేదంబు, నడుమ పుట్టగనేలా ?
చెట్టంబట్టగనేలా ?
పట్టుడు సహజైక్యమతము, ప్రమదంబందన్ ॥ 74

త్యాగంబున జన్మించుచు,
త్యాగంబున వృద్ధియగుచు, ధాత్రీ స్థలమీ
త్యాగంబున పూర్ణంబౌ
త్యాగంబును మఱువరాదు, ధర్మజ్ఞుడిలన్ ॥ 75

త్యాగమే దయామయునకు ధర్మమయ్యె
త్యాగము, దయ, ప్రేమ వివిధాంతరములందు
సచ్చిదానందతత్త్వమై సమరసమగు
బుద్ధుడే క్రీస్తుగా భూమి పుట్టెనేమొ? ॥ 76

ఋషులనుపనిషత్సారంబు, క్రీస్తు జీవి
తకథ, శరణులవచనోక్తి, దర్శనమయి
దేశకాలభేదంబులు తేలిపోవ
సత్యసౌందర్యశివములు స్పష్టమగును ॥ 77

నమ్మిన శిలయేని, నారాయణుండగు
ప్రణయమున్న మిత్తిభాగ్యమొసగు,
శాంతికలుగ ముక్తి సామ్రాజ్యమే దక్కు
పూని నరుడు వీని పొందవలయు ॥ 78

సర్వమత సమ్మతంబైన, స్వామి వాక్కు
సార్వకాలిక సత్యంబె చాటెనంచు,
చేరు జనమొక్కరొకరితో, చెప్పుకొనుచు,
నడువ సభ ముగిసె గురుండు విడిది కేగె ॥ 79

స్నాన మొనరించి, యీశ్వరార్చనము సలుప,
ఇష్టలింగాన దర్శించె హిమగిరిగురు
నాశ్రమాంతర ఋషివరు, డాత్మ నిలువ,
చేరు గంగాధరయ్యతో జెప్పె నిటుల ॥ 80

మంచు కొండల, శాద్వలాంబరవనాల,
ఉపనిషన్మూర్తి యెవ్వరోనుండిరిచట
అతని దర్శింపవలెనంచు నాజ్ఞ సేయ
స్వామి! మీ రన్న చిన్నెల సారమెరుగ ॥ 81

స్వామి రామాఖ్య, డద్వైత సాధువై హి
మాలయావేద విజ్ఞాన ఆశ్రమంబు
కట్టి, పెన్సిలువేనియా పట్టణమున,
అది, ప్రసిద్ధ ఋష్యాశ్రమంబయ్యె నేడు ॥ 82

అతడు సతతమాధ్యాత్మవిద్యా ప్రభావ
మణువణువునందనుభవించి, అంతులేని
శాంతినందు, ఆ సన్నికర్షణవిభూతి
నౌర! బుధవరుల్ పడిగాపులైరి యచట ॥ 83

అతని దర్శనార్థమై దేశ దేశాల
నుండి ప్రజలు వచ్చుచుంద్రుకాని
స్వామిదర్శనంబు సంచిత పుణ్యాత్మ
లందగలరు ఆత్మ ఆత్మ గలియ ॥ 84

అన్యులగువారికీచింత, యంతలేదు,
ఆ సహజ సుందరమగు ఋషాశ్యాశ్రమంబె
శాంతి సౌఖ్యముల్ సేకూర్చ, స్వాంతమునకు
తిరిగివత్తురు తత్రప్రభల్ ధరణిచాట ॥ 85

మూడునెలల ముందనుమతి పొందకుండ
అతని దర్శింప దుర్లభంబగును కాని
యత్న మొనరింతు, దానిపైయభవు కరుణ
అంచు దూరవాణినతండునచటికందె॥ 86

భారతావనినుండి, సుత్తూరు శివగు
రుడు, హిమాలయా వేదగురుని కలియగ,
వచ్చిరీ విషయంబును, స్వామికెఱుక
పరచుడన, ఆశ్రమస్థులాపలుకు వినక॥ 87

రామన్ స్వామినిచూడగ,
నే మాత్రము వీలుపడదు, నేడంచున్, ఆ
హైమవతీ సంచాలకు
లే మార్చలుకట విని, గురుడే మాత్రంబున్॥ 88

విసుగొందక, వినిపించె, ని
జ సహచరులతోడ నేడె, చని, ఆశ్రమమున్
వెస దర్శింతుమనుచు, ముం
దుసాగ, వారు ప్రతిబలుకతొక్కిసలాడన్ ॥ 89

స్వామి వెంటనే ముందుకు సాగిరెటులొ !
వర హిమాలయాశ్రమ గృహాంతరమునుండి
ఒక్కవర్చస్వి, మహిమాన్వితోజ్వలుండు,
ద్వారసీమకు, చకచకతరలివచ్చె॥ 90

ముందు నడువనావర్చస్విడెందముబికి,
చేతులారగ శివగురున్ చేరదీసె,
కన్నులానందబాష్పముల్ గ్రమ్ముచుండ,
ఇద్దరేకాత్ములై లోనికేగిరంత || 91

స్వామిరాముడు, శివగురుస్వామి గలియ,
ఆర్షధర్మముశైవమందైక్యమయ్యె,
చుట్టు పట్టులవారెల్ల చోద్యమంది,
చూడమిట్టి దృశ్యమనుచుస్తుతినొనర్ప || 92

చూడకాదన్న వారలే చోద్యముగను,
ఆశ్రమంబును చూపనత్యాదరమున
శరణులద్భుతానందసంభరితులైరి
యోగి చర్యలు యోగికేద్యోతమగును || 93

స్వామి, శివరాత్రి రాజేంద్ర సద్గురుండు
తరలివచ్చె దరహసితోద్వదనుడగుచు,
సహచరాళి కుతూహల స్వాంతులగుచు,
గురునితో తమ విడిదికి తిరిగిరాగ || 94

డిస్నిలాండు, లాస్ఎంజిల్సు డెందముబుక
చూచినార, మాదృశ్యముల్ చోద్యముగను,
కాని, వాచామ గోచరంబైన శాంతి
యేదొ ఆశ్రమంబున యెదకెగసివచ్చు || 95

ప్రాక్ప్రతీచీగుణద్వయంబాత్మదెలిసి,
సర్వధర్మసమన్వయ స్థాపనకయి,
రాముడే యిట ఆర్షధర్మాశ్రమంబు,
నిలిపెనని శరణాళితోబలికె గురుడు || 96

భక్తుడొక్కడేతించి దేవా! స్వతంత్ర
వైద్యసంస్థలో బ్రతికెడివాడ నేను,
మాచికిత్సా స్థలికి, ఒక్కమారు మీరు
రాగ సార్థకంబౌను మాబ్రతుకులనగ ॥ 97

స్వామి గంగాధరయ్యనుపారచూడ,
అతడు సుంత యోజించి, అయ్యా గురుండు
రేపు మీ వైద్యశాల దర్శింపగలడు,
అనగ తృప్తాత్ముడై ఆతడరిగెనపుడు ॥ 98

మరునాడు గురుడు, తన సహ
చరవర్గముతోడ, వైద్యశాలనుచూచెన్
విరివిగ వెల్తురు, గాలి, ప్ర
సరించుచు విశాల గదుల చలువలు గ్రక్కన్ ॥ 99

అచట రోగుల, ధవళవస్త్రాంగనల్ హ
సన్ముఖాబ్జలై పరిచర్యసలుప, దేవ
దూతల విధాన, పారాడదోచవయ్యె
వ్యాధులౌర! వాత్సల్యమే అమృత సిద్ధి ॥ 100

ఈచికిత్సోపయంత్రంబులెరుగగా భి
షగ్వరకుశాగ్రబుద్ధి విస్పష్టమయ్యె
తల్లిగా వీరిశక్తి యీ ధరణిగాచె
జీవుడే శివుండయ్యెడి క్షేత్ర మిదియె ॥ 101

వైద్యతండంబులోనొక్క భక్తుడు, గురు
దేవ! మిముబరీక్షింపమీ స్థితిగతిమతి
తెలియు, తదనుగుణముగ వర్తించుటాద్య
ధర్మమగునంచు, వేడ, నాతండునగుచు ॥ 102

స్థితిగతులీమేనికి పరి
మితమౌ కాని, యెదనున్న మృత్యుంజయునీ
వెతలంటవనగ, పరిజన
మతి దీనత గురుని మోము నవలోకింపన్ ॥ 103

వారి మన స్థితి నెరిగి, శ
రీరంబిదగో నిపుడె బరీక్షింపుడనన్
ఆరాజేంద్రగురుసిరా
సారాంతర రక్తనాడి చలనములెరుగన్॥ 104

వారలాశ్చర్యచకితులై బలుకులుడిగి
గురనకత్యంత భక్తితో నెరిగి, భక్త
వరులతో, మహామహిమడీ స్వామి, యితని
అంతుదెలిసెడి విద్యమాకందదయ్య॥ 105

గురుని అంతరంగిక సహచరులతో, ర
హస్యముగ వైద్యబృందంబు నల్ల బలికె,
పైకి యేమొ ఆరోగ్య సంపత్తి దోచె,
కాని లోలోన తెగని రోగములు గలవు ॥ 106

ప్రబల మగు మధుమేహంబు, రక్తపోటు,
అడ్డగిలక, మూలవ్యాధి, అతిశయించె
ఒకటి సరిచేయ రేగియింకొకటి కాటు
వేయు, నిదిరోగముల పుట్టప్రేలునెపుడొా ॥ 107

కాన అత్యంత శీఘ్రంబుగా స్వదేశ
గాములై మీరు మరలుట కడుశుభంబు,
పాదరసముగ తిరుగుచు బ్రతుకు గురుని
తనువు, చాలకాలంబిక తాళదనగ॥ 108

దేశకాలస్థితిగతుల ధిక్కరించి,
ఆత్మబలముతో నీగురుండలరుచుండె,
ప్రకృతినెంత శోధించినా పట్టుబడక
మిత్తినిజయించు, నౌషధంబెరుగమనిరి ॥ 109

సహచరులుహతాశులగుచు స్వాంతమందు,
లేని ధైర్యంబుపైకి కల్పించుకొనుచు,
విడిదికేతేర, ఆభక్త బృందమధిక
శ్రద్ధ నిధులిచ్చి గురుని స్తోత్రంబు సేసె ॥ 110

అంత గంగాధరయ్య అత్యంత వినయ
వినమితశిరస్కుడై బుద్ధి ! వేగమనము
వెను తిరుగవలె, వ్యవధి తీరినదిమనకు
అన గురుడు రేపె పయనంబు మనకనంగ ॥ 111

మరల లండనుపైన, బొంబాయి చేర,
వారల విమానమాకాశ పక్షియయ్యె
గురుని మనసు శివానంద గిరుల కెగసె,
దివ్యతేజంబుతో, మోము తేజరిల్లె ॥ 112



తనువు మట్టిలోగలిసినా, మనసు చెడదు
మనసు జన్మవాసనలు సంబంధముడిగి,
ఆత్మనేకాకృతిగన, శివైక్యమగుచు
సమరసానందమున్ పొంది, శాశ్వతమగు ||

# సమరసము

తమ విమానంబు బొంబాయి దరియగానె,
స్వామి, అరవిచ్చు కన్నుల స్వాగతంబు
బలుకు భక్తులపై శివప్రభలుచల్లి,
బెంగళూరును చేరె, విమాన వీధినంత || 1

హర్షధ్వానంబులతో
వర్షింపగ భక్తులు సుమవర్షంబు, జనా
కర్షితవదనుడు సుగుణో
త్కర్షస్వాంతుడు గురుండు దరియగవారిన్|| 2

వారుదెచ్చిన కారులో చేరి గురుడు
కూర్చొన సహచరాళితో కుదుపులేక
వాయువేగాన మైసూరు కరుగ నదియు
వారికీ పయనంబతిదూరమయ్యె || 3

అమృత హృదయ, శీతల శిశిరాంబు కణము
లల్లనల్లన వారిపై చల్లి, తల్లి
సరస కావేరి, వారికి స్వాగతంబు
అలలతో నిచ్చి గురునకు హాయి గూర్చె || 4

మఱి పురోగమింప, మాహిష్మతీ లక్ష్మి
పుష్ప సౌరభముల పుల్కలెగయ,
హృదయమలర వీచె, ఎంత వారలకైన
జన్మభూమియన్న స్వర్గమగును || 5

ప్రజలు తండోపతండంబులై దరియగ,
క్రిక్కిరిసె వీధులన్నియు, కేలబట్టి
అడ్డపల్లికిదెచ్చె భక్తాళి, గురుడు
వలదు వలదంచు వారించె వారినచట|| 6

సంజకిరణాలు ముఖము పైజారిపడగ
స్వామి నడచె, ఆయుర్వేదశాలనుండి
వచ్చెనాజగన్మోహనవలయమునకు
పట్టణ ప్రజ స్వాగతంబతనికీయ ॥ 7

ఇట్టి దృశ్యమిందాక, యీ పట్టణాన
చూడలేదని ప్రజపొంగి, చూచుచుండ,
నాటిరాచబాటలు పూలబాటలయ్యె
భక్తకోటికి కన్నులు పండువయ్యె ॥ 8

దేవుడనయెవ్వరో వేరె, తెలియలేము
కాని నడచునీదేవునే గంటి మనెడి
ప్రజల ఆసంభ్రమోత్సాహ పరిధినెరుగ
అంతులేదయ్య పట్టణం బాగదయ్యె ॥ 9

మైసూరు మఠము సేరగ,
నాశివరాత్రి గురువరుని ఆరాధింపన్,
వే, శిష్యకోటి సందడి
తో, సుమఫల సౌరభములతో జనుదెంచెన్॥ 10

నిత్యమిష్టలింగార్చనానిరతి నడువ,
చెంత చేరిన వారల చేరదీసె,
శరణు చొచ్చిన వారికి తెరవు చూపె,
మరల మఠమున కలకలంబందుకొనియె ॥ 11

రాజగురుడు సింహాసనా ప్రభుతమెరయ
యమ నియమ సామరస్యంబులాత్మ శక్తు
లెల్ల పండగ, యేబది యేండ్లునిండి
అమృత ఫలములిజ్జగతికి అందజేసె ॥ 12

ఆ ఫలములనుభవించు, ర
సోపాసకు, లార్యులు, సరసోదారులు, ప్ర
జ్ఞా పాండిత్య బలాధిదకు
లీ పరమాచార్యగురుని యెదల, దలచుచున్ ॥ 13

వాణి వారిపై వచ్చి సంభావనా ప్ర
బంధ విరుల చల్ల, వివిధ పరిమళముల,
అవ్విరుల గూర్చి "మల్లెదేవరు" గురునకు
అర్చనా గ్రంథమున్ గూర్చెనధికభక్తి ॥ 14

రాష్ట్రవరకవి "పుట్టప్ప", రాజగురుని
అమృత సుమహోత్సవసభకధ్యక్షుడయ్యె
శిష్యులు హితైషులంతనశేషభక్తి
అర్చనాగ్రంథమర్పించిరాగురునకు ॥ 15

కవులు, పండితులు, రసికాగ్రవరులు, సచి
వోత్తములు, మఠాధిపతులీ, యుర్వియెల్ల
నిండి యటకిటకిటలాడుచుండ, గురుడు
ధీర గంభీర మూర్తియై తెలియబలికె ॥ 16

ఉత్తమకృతినిర్మాణం,
బుత్తమ గ్రంథ ప్రకటన, ముభయోచితమై,
ఉత్తమజనసాంగత్యం
బుత్తమమగునని, గురుండునుద్ఘోషించెన్ ॥ 17

వీరశైవధర్మంబిల విస్తరింప,
తగిన రీతి శ్రమించుట తప్పుగాదు
అన్య ధర్మమున్ ద్వేషింప కహరహంబు
నాత్మ ధర్మమున్ రక్షించుటవసరమగు ॥ 18

అఖిల భారత శరణైక సాహిత్య స
భ, మహిషోర్విని ర్మితమయి నేడు
భక్తులీమహోత్సవంబిట్టె నిలుపక,
ముందు ముందుకూడ ముందుబడగ ॥ 19

అప్పుడప్పుడీరీతి మహాసభలను,
తప్పక మఠంబు జరిపింప, దాని కనువ
గు, నిధి, శివరాత్రి గురుడు సేకూర్చె, సాంస్కృ
తీ ప్రచారమాధ్యాత్మశక్తికిబలమగు ॥ 20

వివిధ కళల విద్వాంసుల బిలువబంచి,
వారినెల్లతగిన రీతి గౌరవించి,
పరిపరి విధాలబరగునీశ్వరవిలాస
మనుభవించురసజ్ఞులే, ప్రాజ్ఞులరయ ॥ 21

పరిశోధనలో మిక్కిలి
బరిశ్రమించు బుధజనుల పాండిత్యకళల్,
గురుతించి గౌరవించుట,
గురువుల కర్తవ్యమంచు ఘోషించె సభన్ ॥ 22

శివరాత్రిరాజ గురు, నీ
ప్రవిమలభావంబు సత్యవర్తన, కార్యో
త్సవముల్, స్తుత్యర్హములై
వివిధాంతరముల, జనులకు వెలుగయ్యెనిటన్ ॥ 23

స్వామియెంత వైరాగ్యసంపన్నుడో, తె
లియగ యతని ఔదర్యమే బుజువొనర్చె,
గుణముతో జేరు, సంపద, జనులకెంత
దారిదీపమో నేడె ప్రత్యక్షమయ్యె ॥ 24

ప్రజలిటునుతింప, నాటిసభముగిసె, శివ
రాత్రి గురుడొక్క సంధ్య, విశ్రాంతికి జయ
చామరాజేంద్రతాంత్రిక సంస్థబయల
సహచరాళితో వాహ్యాళి సలపుచుండ॥ 25

వినవచ్చెనొక్కయార్త
ధ్వని, యేమోయని గురువులు తాంత్రిక శాలాం
గణమును చేరగ గది బం
ధనమునబడి, కుక్క పిల్ల నలగుట చూచెన్ ॥ 26

గురువుల చూచి మరింతగ
అరచుచు, నదిపైకెగయుచు, నద్దము త్రుంచన్
పరుగులు దీయుచు, దీన
స్వరమున మొరలిడు ననాథజంతువు చూడన్॥ 27

వాకిలిందీయ కున్ని వెల్వడును రేపు,
దీనికైమనమింత చింతింపనేల ?
ప్రొద్దువోయె, పోదమటంచు పోబలుకగ,
సహచరుల బల్కుల విని సద్గురుండు॥ 28

ఛీ ! యేటి మాటలివి, యి
ట్లే యిది యీరాత్రి యెల్లయేడ్వవలెనె ? యీ
నాయి న్విడిపింపగలే
మే? యన కావలిభటుండు నేతెంచె, వెసన్॥ 29

దీనిని మఱచి బుద్ధి! బంధించెనెవడొ ?
గదికి తాళంబునాయెడ, కల్గదిపుడు,
తెత్తుననివాడు పరువుల దీసి, శీఘ్ర
ముగతిరిగి వచ్చి, తద్బంధమున్ సడల్చె॥ 30

గాలిరీతిగ, ఆ ప్రాణి, గదిని దాటి
తోకనాడించుకొంచు ముందునకు దూక,
స్వామి వెతలు నిట్టూర్పులో సడలె, మూగ
జీవుల స్వేచ్ఛలో జూచె శివుని గురుడు ॥ 31

కాళ్ళచు ప్టెడి ప్రాణిని కరుణచూచు
స్వామిలో బుద్ధదేవుని చాయగాంచి
సహచరుల్, ప్రతీచీసంధ్యజారుచుండ
వెలుగు వెన్నెలలో మతాభిముఖులైరి ॥ 32

అవసరంబయ్యె విశ్రాంతి ఆత్మ గురుని
కంచు, చూడవచ్చిన, శరణాళినడ్డు
సహచరులధిక్కరించుచు, సద్గురుండు
ఎల్లరకు దర్శనంబిచ్చి, తృప్తి పరచు ॥ 33

సహచరబృందము వైద్యుల
రహస్యముగ చేరబిలిచి, రాజేంద్రగురున్
అహరహము చూడదగును, ని
స్పహాయులైరి, పరదేశ శారీరజ్ఞుల్॥ 34

పరదేశ వైద్యనిపుణులు
బరీక్ష చేసి, గురునాశవదలిరి, గురుడో
నిరతంబు శ్రమించు, వినరె
వ్వరి మాటలు, నేమి సేయ వలెనో యిటపై ॥ 35

వైద్యవరులు మీరె, బ్రతికింపవలె గురు
వరునటంచు, వారుబాష్పకణము
లురల బలుక, వైద్యులోపినంత కొలుతు
మింక, తుది ఫలంబు, యీశ్వరేచ్ఛ ॥ 36

ఒక్కనాడు రాజేంద్రుడత్యుగ్రజపత
పస్సమాధిలో నిలువగ, బ్రాగ్గురువర
తతి, ఎదుటనిల్చి, పండెనీ తపము, రమ్మ
టంచు, వెల్గులో వెలుగుగా నైక్యమైరి || 37

పుల్కు పుల్కున మేల్కాంచి, పూర్ణగురుడు
ఎదుట నిల్చిన నిజ వైద్య బృందము గని,
చాలు మీ సేవ, శివుడిట సంతసించె,
అంచు వారల బంపించి ఆదరమున || 38

స్నేహదీక్షితుండు శివప్ప చెంత చేర,
మంత్ర దీక్ష హస్తాబ్జసంభవుడు దేశి
కేంద్ర గురు కుమారుడు నిల్వ, కేలు మోడ్చి
మఠము వారల జూచి, నెమ్మదిగ బలికె || 39

మఠము సేవింప స్వార్థంబు మాయమగును,
మంత్రము జపింప సిద్ధించు మహిమలెల్ల
జీవకోటిని ప్రేమింప శివుడు మెచ్చు,
మనకుగురు లింగ జంగ మార్చన విధియని || 40

ఔప్పవాల్పక, కనులిష్టలింగము గన,
నాలుక "నమచ్ఛివాయ" యన, కొన యుసురు
బయలుగాన్, కేలు గుండె పైబడ, గురుండు
సమరసానందమున్ పొంది, స్థాణువయ్యె || 41

అక్షయ మార్గశిరము సిత
పక్షంబున, పంచమి శనివారోదయ ప్రా
కృక్షుల, యవ్యక్తధ్వని
యాక్షితి రేగగ, గురుండు నీశుని చేరెన్ || 42

స్వామి లింగైక్యమందిన వార్త మహిని
పిడుగు చిట్లిన రీతి వ్యాపింప, రాజ్య
మందు శరణులు, వివిధ మఠాధిపతులు
ప్రజలు మంత్రులు రచయితల్ వ్రాలిరందు ॥ 43

పుష్పమాలాభిషేకమైపోయె గురుని
లింగదేహము, ధూప దీపాంగరాగ
శోభితంబయి, నిద్రించు చున్న రీతి
స్వామి చూపట్టె శోకించు జనులకెల్ల ॥ 44

ప్రతి పత్రికయున్ బాష్పా
ర్చిత శ్రద్ధాంజలి నొసంగి, శివగురు సేవల్
నుతియించుచు, వ్రాసెన్ వి
స్తృత మౌ సంపాదకీయ, మెల్లరువగవన్ ॥ 45

పత్రికల చూచి యేడ్వనివాడు లేడు,
రేడియో విని చెదరని వాడు లేడు,
నాడు రాజేంద్ర గురుని మనసున దలచి
వెతపడని మఠాధిపతి కన్పింపడయ్యె ॥ 46

తెప్పవాల్పని కనులలో, దప్పదయ్యె
కాంతి, పలుకులుడిగిన వక్త్రాంచలాల
చెదరనట్లుండె చిరునవ్వు చిత్త శాంతి
మూర్తిగాన్, స్వామి దేవుడై పోయె జగతి ॥ 47

కారుపై స్వామి తనువు సూత్తూరు చేర,
మధ్య పల్లెలు పల్లెలే మరలి వచ్చె,
బాష్ప పుష్పాల వర్షింప, స్వామి పదము
లంట, గమ్య ముంజేరనాలస్యమయ్యె ॥ 48

వారమేని కాలేదు మైసూరులోన,
మనమహాసన్నిధిన్ చేరి, మాటలాడి,
ఇంతలో నింత లగుట యూహింపనంచు,
వలవలనొకండు వాపోయె, వగపులెగయ ॥ 49

కటకటా! మొన్న మొన్ననే గద యిచటికి
వచ్చి శివయోగ మహిమల ముచ్చటించె,
ఆదరమున మాతోడ మాటాడు దేవు
డింకయెవ్వరోయని వెక్కి యేడ్చె ప్రజయు ॥ 50

స్వామి పార్థివదేహమున్ పారజూచి
ఒకడు పిచ్చిగా ప్రేలె, వే రొకడు చూచి
చూడనట్టుల యెచటికో సురిగె, మరియొ
కడు పకపక నవ్వుచు వెర్రిగా పరువిడె ॥ 51

అకట, యెంత వారికైన యీ స్థితి దప్ప
దయ్యె, బ్రతికి నంత దాక విశ్వ
మెల్ల శివునిదంచు యీశ్వరార్పణ బుద్ధి
సేయు సేవ రక్ష సేయ దిపుడు ॥ 52

భక్తులు, శరణులు, మఠాధిపతులు, మంత్రి
వరులు, వాగులు వాగులై వచ్చి పడగ,
చిట్టి సుత్తూరు దిశలంటి పట్టణమయి
చిన్నదై కదిలె కపిలా జీవనదియు ॥ 53

పూర్వ గురుల సమాధుల పొత్తుకుదర,
వీరశైవాగమ ప్రోక్త విధుల తోడ,
రాజగురుడు సమాధి భద్రస్థుడయ్యె
పరమ పంచాక్షరీ మంత్ర పఠనమందు ॥ 54

కోరి సుత్తూరు రాజేంద్ర గురు సమాధి
కొలువనేతెంచు నిజ భక్త కోటి, కొందు
రిందు నిష్టార్థ సిద్ధుల, హితము తోడ
ఔర! మరణమే లేదు మహాత్ములకిల ॥ 55

కపిల రాజేంద్ర గుణములే కంఠమెత్తి,
పాడుకొనుచుండె, నా చుట్టు పట్టులెల్ల
పచ్చ పచ్చగ స్వామి సంపత్తు దెలిపె
జ్ఞాన విజ్ఞాన దీప్తుల స్వామి వెలిగె ॥ 56

పూర్వ గురువులు సాధించు పుణ్యమెల్ల
దేశికేంద్ర గురుడౌచు తేజరిల్లె,
వివిధ విద్యాసుగంధముల్ వెల్లి విరిసె,
సార్వజనిక విద్యార్థిపుష్పవనులొప్పె ॥ 57

రోగరు జనాది బాధల రోజుచున్న
అనద వర్గమున్ ప్రీతితో నాదరించి,
పైబడునపమృత్యు వదిరిపడగ, గురుని
తపములో లేచె వైద్య విద్యాలయంబు ॥ 58

త్రివిధ దాసోహియై, గురులింగ జంగ
మార్చనారతిన్, శరణాళి అహరహంబు
మఠము గొల్చుచు మంత్రమున్ మది జపించి
జీవకోటిని ప్రేమించు శివుడు మెచ్చ ॥ 59

అన్నిటికి మూలమౌ అహంబధిగమించి
త్యాగ వైరాగ్య భావంబు లలము కొనగ,
మనుజులన్ తీర్చి తిద్దెడి మహిమలొప్ప,
శ్రీ సుతూరు పీఠము చాటె శివుని శక్తి ॥ 60

శాంతి శాంతి శాంతిః



బాడాల రామయ్య

మదనపల్లె, చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశం జన్మస్థలం. నంజమాంబా నాగేశ్వరలు తల్లిదండ్రులు

విద్యాభ్యాసం: ప్రాథమికోన్నత విద్య, ది వ్యజ్ఞానోన్నత పాఠశాల మదనపల్లి. ఎం.ఏ. డిగ్రీ. పచ్చయప్ప కళాశాల మదరాసు. డి.లిట్. పట్టము మైసూరు విశ్వ విద్యానిలయం.

ఉద్యోగం : ౧౯౫౪ నుండి ౧౯౭౨ వరకు ఆంధ్రోపన్యాసకుడు, ౧౯౭౨ నుండి ౧౯౮౨ వరకు తెలుగు శాఖాధ్యక్షుడు మైసూరు విశ్వవిద్యానిలయం. ౧౯౮౨ నుండి ౧౯౯౦ వరకు తెలుగు ప్రాచార్యునిగా బెంగళూరు విశ్వవిద్యాలయం. కర్నూలు స్నాతకోత్తర విద్యాకేంద్రమునకు దార్మ నికాచార్యుడు (విసిటింగ్ ప్రొఫసర్)

రచనలు : కృష్ణక ధావిపంచి, లేపాక్షి స్వప్నదర్శనం, ఆనందవల్లి, బసవేశ్వరవచనాలు సమగ్రసమీక్ష, సౌందర్యలహరి (తెలుగు), పంపానన్న య్యరప్రతిభాతపస్సు (కన్నడ), వీరేశలింగం (కన్నడం) మున్నగునవి

ప్రశస్తులు: గడియారం శేషశాస్త్రి ప్రశస్తి, ఆంధ్రగవర్నమెంటు కవిసన్మానం, పుట్టపర్తి సత్య సాయి బాబా సన్మానం, శృంగేరి సంస్థాన సన్మానం, సిరిగెర తరళబాలు మఠ సన్మానం, సుత్తూరు శివరాత్రీశ్వర మఠ సన్మానం.

విలాసం : బాడాల రామయ్య ౧౦, ౧౧నె క్రాస్, జయనగరం, మైసూరు.

---

జగద్గురు శ్రీ శివరాత్రీశ్వర గ్రంథమాల మైసూరు 570 004

వెల ౨౦ – ౦౦ రూ